వేంకటశర్మ, మంగిపూడి, 1882-1943

నిరుద్ధభారతము

రాజమహేంద్రవరము, 1927

Record no. 395

Vēṅkaṭaśarma, Maṅgipūḍi, 1882-1943

Niruddhabhāratamu

Rājamahēndravaramu, 1927

Record no. 395

## Bibliographic Record Target

వేంకటశర్మ, మంగిపూడి, 1882-1943.

నిరుద్ధభారతము / ఇది మంగిపూడివేంకటశర్మచే రచియింపఁబడినది.- రాజమహేంద్రవరము : శ్రీజగపతిముద్రాక్షరశాల, 1927.

78, 7, (2) p. ;18 cm.

Record no. 395

Vēṅkaṭaśarma, Maṅgipūḍi, 1882-1943.

Niruddhabhāratamu / idi Maṅgipūḍivēṅkaṭaśarmacē raciyimpam̐baḍinadi.- Rājamahēndravaramu : Śrījagapatimudrākṣaraśāla, 1927.

78, 7, (2) p. ;18 cm.

Record no. 395

35 mm microfilm

Image placement: IA IIA IB IIB

Date filming began:

# నిరుద్ధభారతము

ఇది

మంగిపూడి వేంకటశర్మచే

రచియింపఁబడినది.



శ్రీ జగపతి ముద్రాక్షరశాల
రాజమహేంద్రవరము.
1927

 [వెల రు 0-8-0

# పీఠిక



భరతఖండము నిరుద్ధము. స్వత్వస్థాపనమం దసమర్థము. ఈవిషయము నెఱుంగుటయుఁ దన్నిరోధమును దొలఁగించు కొనుమార్గంబు లరయుటయు ననంతరము ధర్మస్థాపన మైన స్ఫుటయు విధియై యున్నది. సంఘమూన కాయువుపట్టుల నరసి వానియందు ప్రాణంబులు పూరించినగాని స్వత్వమురాదు. కావలసినది సంఘసంస్కారము. సంఘమర్యాదలు సంఘస్వభావము తెలియని సంస్కరణోద్యమము, భిన్నభిన్న జాతులను వర్ణములను కలిపివేయుటకు ప్రయత్నించి విఫలమైనది. కొద్దిమం దెక్కడనైన జాతిభేదమును సంస్కారము కొఱకు వదలుకొన్నను స్వధర్మనిరసకు లగుచుంటచే సంఘమున కంత మేలు కలుగలేదు.

బ్రాహ్మ క్షత్రియ వైశ్య శూద్ర లనునాల్గు ప్రధానవర్ణములును వీని యనులోమ ప్రతిలోమజాతులు, పతితులును, బాహ్యజాతులును గలసిన భరతఖండసంఘము మనువు నాఁటినుండి నేఁటివరకుఁ గొంచెమించుమించుగ నొక్కటే తీరుగ వచ్చుచున్నది. జాతుల కొండొరులతో సంబంధము లేకున్నను, అన్నిఁటికి నొక్క కేంద్రముతో సంబంధము కలిగియుండుటవలన నిన్ని భేదము లుండియు సంఘ మొకప్పుడు బలవంతమై స్వత్వస్థాపనసమర్థమై యుండెను. ఇప్పుడా కేంద్రస్థానము సంఘమందు లేకుంటయు జాతిభేదములు మ్ముదు

పటివలెనే యుండుటయు రెండును తటస్థించుటచే స్వత్వశూన్యమై సంఘము క్షీణించుచున్నది. నిమ్నజాతులని యిప్పుడు వాడఁబడు కొన్నిజాతులేకాక సంఘమంతయు నిమ్నమయి నిరుద్ధమై నిరుద్ధభారతశబ్దకల్పన కవకాశమిచ్చినది.

కర్తవ్యము కేంద్రస్థానము కనుగొనుటయా? భేదము లడఁగించి సంఘమంతయు నేకముఁ గావించుటయా? ఇంత కాలమునుండి విమతములుగల విదేశీయులు, వర్ణవిభేదము లేని సంఘములు, రాజులుగా కాపులుగా మన దేశమునందు నివసించినను తురకలకత్తులకుగాని ప్రభువుల యానలకుగాని క్రైస్తవుల బోధలకుగాని లొంగక సంఘము యథాస్థితి నుండుటయే. భేదములు శాశ్వతములనియు వానిని పోగొట్టు ప్రయత్నములు వ్యర్థములనియు స్పష్టపడుచున్నది.

వ్యష్టిజాతులకు సమిష్టిసంఘమునకు గల యంగాంగి భావమును సంపూర్ణముగ గ్రహించి, యగ్రజన్మమాత్రమునసే యనధికారులు కూడ శ్రేష్ఠత్వ మారోపించుకొని నీచులనువారిపై స్వారిచేయక, ధర్మరక్షణపరులై యుండువారలు కలియకపోయినను ఎల్లను కేంద్రముతో సంబంధము కలిగి యుండి సంఘసమిష్టి క్షేమమును సాధించుట కర్తవ్యము.

అన్నివర్ణము లేవర్ణమును పరమావధిగ నుంచుకొని తత్సాంప్రదాయముల నాచారముల ననుకరింపజూచునో. ఏవర్ణము అన్యోన్యసంబంధములేని తదితరములైన వర్ణములన్ని



టితో సంబంధము కలిగియుండునో, ప్రకృతి శ్రేష్ఠత్వముచే తను నియమధారణముచేతను సంస్కారవిశేషములచేతను అన్నిటికంటె నుత్కృష్టత యేవర్ణమునకుగలదో యది సంఘమునకు కేంద్రమనందగు. ఇన్నినాళ్లవరకు కేంద్రస్థానమందున్న బ్రాహ్మణుఁ డాస్థానము నాంగ్లేయుల కొసంగినాఁడు.

శ్రోత్రియోత్తముల బాలకులు స్వధర్మమును వదలి యాంగ్లేయుల వేషభాషల నభ్యసించుటకు కేంద్రస్థానము మారుటయే కారణము. ఆర్యసాంప్రదాయములకంటె నాంగ్ల సాంప్రదాయముల కెక్కుడు గౌరవము కలుగుటకిదియే కారణము. చండాలుఁడైన ,,గజకంటి రామాయ,, కంటె, ఆంగ్ల సాంప్రదాయ మవలంబించిన ,,యబ్రాము,,న కెక్కుడు గౌరవమున కిదియే కారణము. కేంద్రస్థానము సంఘమునకు వెలిగానున్నయన్నినాళ్ళు సంఘములోని వారొక్కరొక్కరే జారిపోయి సంఘము క్షీణించును. అన్యసాంప్రదాయములలోనికి పోయిన హిందువుల, నందు ముఖ్యముగ బాహ్యజాతులఁ దిరిగి యార్య ధర్మావలంబకులఁ జేయుట యవశ్యకర్తవ్యము.

అంగాంగిభావము సంఘమునకున్నదని గ్రహించని యగ్రజులు బాహ్యలను తమ యహంకారముచే పీడించుచు పిచ్చికుంచములతో భత్యములను కొలుచుచు ప్రక్కనున్న మాన్యములను గలుపుకొనుచు చేయరాని యన్యాయముల నొడిగట్టుకొనుచున్న విషయము మనుభవజ్ఞులకెల్ల విదితమే. కేంద్రస్థాన

మండలి మార్పులును అగ్రజుల కౌటిల్యమును రెండును జేరి, జాతికి వెన్నెముక యనందగు నంత్యజాతులను సంఘమునకు దూరముచేసి, మనకు గానివారినిగఁ జేసికొనుటకన్న యాత్మహత్య వేఱొండు లేదు. ప్రత్యేకముగ వ్యష్టివర్ణముల నుద్ధరించి మార్గముల నెమకునప్పుడు సమిష్టిజ్ఞానముతోఁ జేయుట క్షేమకరము. నిరుద్ధత్వము జాతికంతకును ఘటించినను ముందంత్యజులను కూడగట్టుకొను నావశ్యకత యీనిరుద్ధభారతమను గ్రంథము కంఠోక్తిగ చాటుచున్నది. పరసాంప్రదాయమువలంబించిన హిందువుల నెటుల సంఘములోనికిఁ జేర్చుకొనవలయునను విషయము అవశ్యవిచారణీయమైనను ఈయుపోద్ఘాతమం దప్రస్తుతము. మనసునకు నాటునట్లు సంఘస్థితిగంతను ఆదర్శరూపముగ నీచిన్నిపొత్తము ప్రతిఫలింపఁ జేయుచున్నది. విచారములను బాపికొని సంఘపటమును ధౌతకల్మషముగ నొనరింపవలసిన యావశ్యకత సహృదయులందరీ గ్రంథమును జదివి తెలిసికొందురుగాక.

బెజవాడ,
5—5—15

దంటు సుబ్బావధాని.

# నిరుద్ధ భారతము.



ఉ. భారత వర్షమందు ఘనపండితుఁడై స్మృతికర్త్రు మండలిన్
జేరువహించినట్టిమను వేద్విజ బాహుజ వైశ్య శూద్రులన్
వారలజాతులే కలవు ,,నాస్తితుపంచమ,, యంచుమున్నని
ర్ధారణచేసి చెప్పెను గదా! మరి దీనికిఁ కేల తర్కముల్?

ఉ. గీతను బోధసేయునెడఁ గ్రీడికిఁ గృష్ణుఁడు చెప్పలేదె! నా
చేతనె నాల్గుజాతులు సృజింపఁబడెన్ గుణకర్మ భేదతా
హేతువుచేత నంచు, మనకెల్లను గీత ప్రమాణమే గదా!
బాతిగఁ జెప్పరయ్య! యిఁకపంచమజాతి యదెట్లువచ్చెనో?

తే. మనువుమొదలైన పండితమాన్యులెల్ల
వర్ణములు నాలు గనుచును వానిలోని
సంకరకులంబె పంచమ జాతియనుచు
నిర్ణయింపరె? సంకరుల్ నేఁడు లేరె? 3

తే. మాల లని, పంచము లటంచు, మాదిగ లని
శ్వపచు లని, చెప్పఁగారానివా రటంచు,
మరియుఁ జండాలు రని తోడిమానవులను
దరలివేయుట సాంఘిక ధర్మమగునె? 4

---

1 శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వైశ్యస్త్రయోవర్ణా ద్విజాతయః
చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తితు పంచమః
మనుస్మృతి దశమాధ్యాయము.

క. శైలంబుల నివసించెడు
మాలరు లను నీచజాతి మనుజులె యిపుడీ
మాల లనఁ బడెడువా రని
చాలుగఁ జెప్పుదుసుగాదె? చారిత్రవిదుల్.
క. అల్ల మతంగ మహాముని
తల్లజు సంతానమెగదా మాతంగుల్!
తెల్లముగ తెలుఁగు నుడి సం
పల్లాలసులార! వారె మాదిగలు సుఁడీ! 6

2 శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః.
భగవద్గీత,

5 కొండలలో నివసించు మాలర్ అను అనార్యజాతి వారే మాలలని ఆంధ్రదేశ చరిత్రకర్తలగు శ్రీ చిలుకూరి వీరభద్ర రావుగారు చెప్పుచున్నారు. 6 మతంగ మహాముని సంతతియే మాతంగులనుటకు - ,,మతంగాజ్జాతాః మాతంగాః,,అని లింగాభట్టీయము. మరియు,,చండీ,,కోపే,, కోపముగల వారు చండాలురనియు లింగాభట్టీయమే చెప్పుచున్నది. మతంగమహాముని కోపిష్ఠియనుటకు నిదర్శనముగా శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారు మానవసేవయం దిట్లు వ్రాయుచున్నారు. ,,మతంగుఁడు బ్రాహ్మణస్త్రీకిని మంగలివానికిని బుట్టిన సంకరార్యుఁడు. బ్రాహ్మణునకును శూద్రునకును



తే. అల మతంగుఁడు ముక్కోపి యగుటఁ గతనఁ
గోపి చండాలుఁడనఁ బరగుట కతాన
నతఁడు చండాలుఁడయ్యెఁ; సంతతికిఁగూడ
వరుసఁ జండాలురను పేరు వాడుకయ్యె. 7
క. ఏవపడక నీచమనక
వావిరి శునకములఁదినుచు శ్వపచులయిరి; అం
తేవాసులైరి పురముల
కావల వసియించు చుండునట్టికతమునన్. 8

బుట్టినవానినిఁ జండాలుఁడని స్మృతులు చెప్పుచున్నవి,, శ్లో. శూద్రాదాయోగవః క్షత్తా చండాల శ్చాధమోనృణాం వైశ్య రాజన్య విప్రాసు జాయంతే వర్ణసంకరాః,, మనుస్మృతి, దశమోధ్యాయము. అనఁగా శూద్రునివలన వైశ్యస్త్రీకి జనించినవాఁడు ఆయోగవుఁడనియు, క్షత్రియస్త్రీకి జనించినవాఁడు క్షత్తయనియు, బ్రాహ్మణస్త్రీకిఁ గలిగినవాడు చండాలుఁడనియు వీరు వర్ణసంకరులనియు నర్థము. అందువలననే మాతంగుఁడను జండాలుఁడుగా లెక్కింపఁబడెను. మతంగుఁడు తాను వర్ణబాహ్యుఁడనని తెలిసికొని తపస్సుచే దానిని మాన్పుకొన గొప్పప్రయత్నమును జేసియు వ్యర్థమనోరథుఁడై యూర్ధ్వవర్త్మమును వదలి దక్షిణాపథమును బ్రవేశించెను. మతంగుని విస్తారముగాఁ దెలిసికొనగోరువారు మహాభారతము అనుశాసనిక పర్వములోని యింద్రమతంగ సంవాదమును

తే. పరమ ఛాందసులైనట్టి బ్రాహ్మణులును
నియమవేళల వీరి పేరయినఁ గాని
చెప్పరాదన్న కతమునఁ జెప్పరాని
వారనుచుఁ బంచములకెల్లఁ బేరు కలిగె. 9

---

జాతురుగాక! ఇతఁడు దక్షిణాపథమును బ్రవేశించిన మార్గము పారియాత్ర పర్వతము ననుసరించి నర్మదను దాటి వచ్చెనని తెలియుచున్నది. ఆర్యావర్తమునందు బ్రాహ్మణులతో సరిపడక నర్మదాతీరమునకు వచ్చెను. అచ్చట నపుడు గంధర్వులను జాతివారుండిరి. వారినాయకుఁడు ప్రియదర్శనుఁడు. వాని కుమారుఁడు ప్రియంవదుఁడు. ప్రియంవదునితో మన మతంగునికి సరిపడక యాతనికి శాపమిచ్చి దక్షిణమునకుఁ దరలెను. ప్రియంవద మతంగుల వృత్తాంతము రఘువంశము 5 వ సర్గలోఁ గనుఁగొనవచ్చును. పిమ్మట మతంగుఁడు వాలి సుగ్రీవాద్యనార్యనివాసమగు ఋశ్యమూకమును జేరెను. అచ్చట మతంగునకు యోజనాయతమైన స్థలమలవడెను. అచ్చటఁ గొంతకాలముండిన పిమ్మట నాప్రదేశాధికారియగు వాలికిని మతంగునకును విరోధము సంభవించెను. ఈవృత్తాంతమును వాల్మీకి రామాయణము కిష్కింధాకాండ 11వ సర్గలో చూడవచ్చును..........మొదట శూద్రునకును బ్రాహ్మణస్త్రీకిని జన్మించి వర్ణబాహ్యుఁడుగాఁ బరిగణింపఁబడి యింద్రునంతవాని మాటనుగూడఁ దిరస్కరించి పిమ్మట గంధర్వుల



ఉ. మానవులందు జాతిపరమానధు లున్నవి, వానితత్త్వమున్
గానక సంచరించిన వశానకలై చెడు జాతియెల్లనీ
మానవధర్మమైనపరమార్థమెరింగినవారు కావునన్
ధీనిధులై వెలుంగు మన దేశపుఁ బెద్దలు తొల్లి తద్దయున్
హీనకులంబులందు జనియించినమానవులై నసద్గుణ

---

తోఁ జేరియు వారితోడను గుద్దులాడి తరువాత నార్యావర్తజనితులగు వాలి సుగ్రీవాదులను జేరియు వీరితోడను బోరాడిన మతంగునికి మన మార్యులు తరుచు కోపముగలవాఁడు గానఁ జండాలుఁడనియు నేవర్ణమునకుఁ జెందనివాఁడు గాన వర్ణబాహ్యుఁడనియు నేగ్రామమునకుఁ జేరనివాఁడు గాన నంతేవాసి యనియుఁ బేర్లిడిరి. మరియు, మతంగుఁడు బ్రాహ్మణికి క్షౌరకునివల్లఁ బుట్టినవాఁడై చండాలుడయ్యెను. పిమ్మట మహాతపస్వియై చండదేవుఁ డనిపించుకొనెను.

భారతము, అనుశాసనిక పర్వము.

(8) "శ్వమాంసము(కుక్క-మాంసము)తినువారు శ్వపచులు-" లింగాభట్టీయము—మరియు, శ్వపాకులనుటకు—శ్లో॥ క్షత్తుర్జాతస్తథోగ్రాయాం శ్వపాక ఇతి కీర్త్యతే॥ క్షత్త యనువానికి ఉగ్రకన్యయందుఁ బుట్టినవాఁడు శ్వపాకుఁడు. శూద్రునివల్ల క్షత్రియస్త్రీయందుఁ బుట్టినవాఁడు క్షత్త. క్షత్రియునకు శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁడు ఉగ్రుఁడు.

మనుస్మృతి దశమాధ్యాయము.

శ్రీనిధులైనచో నలుసుచేయక గౌరవ బుద్ధితోడ న
మ్మానపురస్సరంబుగను మన్నన చేసెడువారు భక్తులున్
జ్ఞానులు, మానులున్, గవులు, సాధ్వులు, యోధులు
బ్రహ్మజాతిచం
డాల రహించినందులకుదాహరణంబులు పెక్కులున్న; వే
హాని జనింపలేదు మన హైందవసంతతికెందువల్ల; దే
శానికి మేలెకల్గె, మనజాతిగరిష్ఠత హెచ్చెనిప్పుడున్
మానక పూర్వికుల్ చనినమార్గమునన్ మనమేగుటొప్పు
గున్. 10

ఉ. ఆదిమభాషయై భువనమంతట రంజిలు దేవభాషయం
దాదిమహాకవీంద్రుఁడయి యాదిమహాకృతికర్తయైన హైం
దాద్రి సురార్చితుండగు మహామునిచంద్రుఁడునైన య
మ్మహా, వేదవిదుండు వాల్మీకి పవిత్రుఁడు మున్నిషాదుఁ
డేకదా! 11.

ఉ. వేదవిభాగముల్ జలిపెవిశ్వము సర్వముఁ బ్రస్తుతింప; న
ష్టాదశసత్పురాణములు ప్రశస్తమతిన్ విరచించె; సర్వలో

(11) మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రిగారి వాల్మీకి చరిత్రము.

(12) శ్లో॥ జాతో వ్యాసస్తు కైవర్త్యాః శ్వపాక్యాస్తు పరాశరః॥ భారతము, అరణ్యపర్వము. నీచజన్మలగు సత్యవతీపరాశరుల పుత్రుఁడు వ్యాసుఁడు—భారతము. ఆదిపర్వము.



కాదరణీయమైన యితిహాసము భారతముల్ రచించె; న
బ్జోదరునంశసంభవమునొందెను వ్యాసుఁడు నిమ్నజాతుఁడే

తే. వ్యాసమునిచంద్రుఁ గన్న పరాశరుండు
మాలదానికిఁబుట్టి బ్రహ్మర్షియయ్యె.
వేశ్యకునుబుట్టి మాలెతఁ బెండ్లియాడి
యావసిష్ఠ మహర్షి బ్రహ్మర్షియయ్యె. 13

క. వేదవ్యాసునకును వే
శ్యోదరమున జన్మమెత్తి యుజ్జ్వలమతియై
యాదిమతత్త్వముఁ గనుఁగొని
కాదీపింపఁడె శుకుండు ధన్యుండగుచున్. 14

మ. మునిచంద్రుండగు నవ్వసిష్ఠుసతియై, ముల్లోకముల్ మెచ్చ రీ
తి నివర్తించిలసద్గుణాఢ్యయయి పాతివ్రత్యమాహాత్మ్యముల్
దనరారన్ వరతారయైపొలిచి మింటన్ దంపతీలోక వం
దనముల్ గాంచునరుంధతీసతియుఁ జండాలాంగనారత్నమే! 15

ఆ. భక్తవగదుఁడైన పండరిపురనాథుఁ
డతి నికృష్ట జాతుఁడైనయట్టి

(13) శ్లో॥ శ్వపాకీగర్భసంభూతః పితా వ్యాసస్య సత్తమః॥ భవిష్యత్పురాణము. శ్లో॥ జాతో వ్యాసస్తు కైవర్త్యాః శ్వపాక్యాస్తు పరాశరః॥ భారతము. అరణ్యపర్వము.

(14) భారతము, శాంతిపర్వము. దేవీభాగవతము, ప్రథమస్కంధము.

నామదేవుభక్తికై మెచ్చి యాతని
యెంగిలన్న మారగింపలేదె? 16

తే. బ్రాహ్మణ శ్రేష్ఠుఁడైన భార్గవుఁడు తొల్లి
ద్విజులు లేని యొకానొక దేశమందు
నర్వసముఁ జొచ్చుఁ గైవర్త జాతిజనుల
జందెములు వైచి విప్రులఁ జలుపలేదె? 17

తే. పంచములు మ్లేచ్ఛులును విష్ణుభక్తి మెఱసి
వైష్ణవులు పూజసేయు నాళ్వారులైరి
మంగయాళ్వారుఁ డొక మ్లేచ్ఛపుంగవుండు
మరితిరుప్పాణి యాళ్వారు మాలవాఁడు. 18

---

(15) శ్లో॥ అక్షమాలా (అరుంధతి) వసిష్ఠేన సంయుక్తాధమ యోనిజా। సారంగీ మందపాలేన జగామాభ్యర్హణీయ తామ్॥ (మనుస్మృతి) స్త్రీభక్తవిజయము.

(16) భక్తవిజయము. ఆచార్యసూక్తి ముక్తావళి.

(17) శ్లో॥ అబ్రాహ్మణ్యే తదా దేశే కైవర్తాన్ ప్రేక్ష్యనిర్గనః
........యజ్ఞసూత్రమకల్పయత్.
స్థాపయిత్వా స్వకీయే నక్షేత్రే విప్రాన్ ప్రకల్పితాన్.
స్కాందపురాణము, సహ్యాద్రిఖండము.

(18) ఆచార్యసూక్తి ముక్తావళి.

(19) దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారి యుపన్యాసము మానవసేవ. (20) మైసూరు రాజ్యమునందలి మేలుకోట



అ. క్షేత్రరాజమై పవిత్రస్థలంబై ప్ర
సిద్ధిఁగన్నయట్టి శ్రీపెరుంబు
దూరునందు మాలవారె రామానుజ
స్వామిరథము నడుప వలయుఁ గాదె? 19

తే. అల్ల మైసూరు రాజ్యంబునందు వెలయు
మేలుకోటను విష్ణు దేవాలయమున
నేడునుం గూడ సంక్రాంతి మూఁడునాళ్ళు
పంచములె చేయుదురు గాదె స్వామిసేవ. 20

తే, అల మహారాష్ట్ర దేశంబు నందు వెలయు
పండరి నారంబునను స్వామి స్యందనంబు
నుత్స వావసరంబుల నొప్పుమీర
నడుపువారలు గోసంగి నరులు గారె? 21

క. పావనమగు పండరిపుర
దేశమున మహారు లనఁగ, ఢేఢులనంగా

---

వైష్ణవదేవాలయమున సంక్రాంతి దినములలో మూఁడునాళ్ళు మాలవాండ్రు దేవున కర్చకులుగానుండి బ్రాహ్మణులకు సహితము శఠగోపమును బ్రసాదము నిత్తురు.,, సూర్యప్రకాశరావుగారి యుపన్యాసము. మానవసేవ.

(21) (22) సూర్యప్రకాశరావుగారియుపన్యాసము, మానవసేవ.

(23) పండిత, భానుభుజదతుగారి యుపన్యాసము.

లేవేవిగ్రహములు; మది
భావింపగ నవియు శ్వపచ ప్రతిమలు గావే? 22

క. రామానుజ ధర్మజ్ఞుఁడు
దీనుని తిరుక్కోవిలుండు తెలియ నవాచ్య
గ్రామణిగాఁడే? యాతని
స్వామిగ బ్రేమింపలేదె వైష్ణవులెల్లన్? 23

క. రామానందుల శిష్య
గ్రామణులు మహమ్మదీయగణములకున్ శ్రీ
రామానుజమత మియ్యరె?
ప్రేమింపరె వైష్ణవులు పవిత్రులటంచున్? 24

క. వనభూషణుఁ డనువిద్వ
న్మణి, విష్ణుస్వామి యనెడు మహనీయుండున్,

---

(24) రామభుజదత్తుగారి యుపన్యాసము.

(25) "నింబాదిత్యుడు కాశీనగరమున మహమ్మదీయ మతమును ఖండించి మహమ్మదీయులను శుద్ధిచేసి హిందువులలోఁ గలిపెను. హరిద్వారమంటు విష్ణుస్వామియు మరికొన్నిచోట్ల వనభూషణుఁడును మ్లేచ్ఛులకుఁ బ్రాయశ్చిత్తము చేయించి హిందువులలోఁ గలిపిరి."

పండిత, రామభుజదత్తుగారి యుపన్యాసము.



ఘనుఁడగు నింబాదిత్యుడు
మును మ్లేచ్ఛుల శుద్ధి చేసి పూజ్యత నిడరే. 25

ఆ. పండరీపురానఁ బాండు రంగ విభుండు
చోక మేళుఁడను శ్వపాకు భక్తి
మెచ్చి దర్శనంబు నిచ్చి సంభాషించి
కూర్మితోడ వాని కూడుఁ దినఁడె 26

తే. స్వాదులో చేదులో యంచు సంశయించి
యించుకించుక రుచి చూచి మంచి వెంచి
ఫలము లిడిన శబరి మూఢ భక్తి మెచ్చి
యెలమి భుజియింపఁడే రాముడెంగిలనక? 27

తే. పంచముఁడు రోహిదాసుఁడు భక్తుఁడగుచు
జర్మపాత్రములందె యర్చనముఁ జేసి
విష్ణుసందర్శనముగాంచి విబుధుఁడైన
దేశికుఁడు మెచ్చ ధన్యుఁడై తేజరిలఁడె. 28

తే. ఏకనాథుండు సద్భక్తలోకవరుఁడు
సాధు భూసురవర సమారాధనమున
ముందుగా మాలలకు నెల్ల విందుఁ జేసి
యాదరింపఁడె దీన దయాళుఁ డగుచు? 9

---

(26) భక్తవిజయము.

(27) వాల్మీకి రామాయణము.

(28) (29) భక్తవిజయము.

క. నందుఁడు చిదంబరపురము
నం దుదయము నంది భక్తుఁడై సర్వజనా
నందుఁడు గాఁడే! పూజ్యత
నందఁడె యాతండు పంచమాగ్రణి గాఁడే? 30

తే. విష్ణుదేవుని భక్తుఁడై విబుధుఁడైన
యంత్యజుఁడె యెదురైన 'దాసోహ' మనుచు
వైష్ణవవరుండు సాష్టాంగవందనంబు
సేయవలె నంట తత్సాంప్రదాయము గద! 31

---

(30) నందచరిత్రము

(31) శ్లో॥ వైష్ణవం వైష్ణవో దృష్ట్వా ప్రణమేద్దండవద్భువి.
వైష్ణవుఁడు వైష్ణవునిఁ జూచినంతనే దండప్రణామము చేయవలయును.

భక్తవిజయము,

శ్లో॥ యః పశ్యతి శుభాచారం వైష్ణవం వీతకల్మషం
యస్మిన్ కస్మిన్ కులే జాతం ప్రణమేద్దండవద్భువి.

శుభాచారపరుఁడును దోషరహితుఁడును నగు వైష్ణవునిఁ జూచిన యెడల కులముతో నిమిత్తము లేకయే వైష్ణవుఁడతనికి నేలమీఁద సాగిలఁబడి మ్రొక్కవలయును.

భక్తవిజయము

శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః



ఉ. క్షత్రియుఁడై జనించి బహుకాలము ఘోరతపంబు జేసి తా
కత్రియమున్ భజింప సరిగాఁ బ్రతిసృష్టి యొనర్చి సృష్టికిన్
ధాత్రిసురత్వమున్ బడసి ధన్యతఁ గాంచిన గాధిరాజ స
త్పుత్రుఁ డుమాలెతల్ తనకుఁ బుత్త్రికలే యని గారవింపఁడే!

---

విద్యావినయ సంపన్నుఁడగు బ్రాహ్మణునియందును గోవునందును నేనుఁగునందును కుక్కయందును దానిమాంసముఁ దినువానియందును బండితులు సమదర్శనులై యుందురు.

భగవద్గీత

శ్లో॥ శ్వపచోపి మహీపాల విష్ణుభక్తో ద్విజాధికః
విష్ణుభక్తివిహీనస్తు యతిశ్చ శ్వపచాధమః

శ్వపచుఁడైనను విష్ణుభక్తుఁడైనయెడల బ్రాహ్మణునికన్న నధికుఁడగును. విష్ణుభక్తి లేనివాఁడు యతియైనను శ్వపచునికన్న నధముఁడగును. భాగవతము.

శ్లో॥ చక్రాంకితభుజం దృష్ట్వా యస్తు తం నాభివాదయేత్
తిర్యగ్యోనిశతం ప్రాప్య విష్ఠాయాం జాయతే క్రిమిః

ఎవ్వఁడేని చక్రాంకితభుజునిఁ జూచి యభివాదనంబు సేయకుండువాఁడు తిర్యగ్యోని శతంబునొంది నికృష్టతమక్రిమిజన్మంబుఁ జెందును.

భవిష్యత్పురాణము.

(32) హరిశ్చంద్రోపాఖ్యానము, స్కాందపురాణము, మార్కండేయపురాణాదికము ఐ.

క. మారోపంతను నట్టి మ
హారాష్ట్రుఁడు భక్తగణమునందు బుధులచేఁ
జేరుపఁబడి పొగడొందఁడె?
దారగ నొతఁడు మాలెతను జేకొనడే; 33

క. తిరువళ్ళూరు క్షేత్రంబున
ధరణీసురునకును మాలెతకు నందనుఁడై
పరగిన కపిలుఁడు పావన
పురుషుండై ఋషులలోనఁ బూజ్యతఁ గనడే! 34

తే. మేటి పల్నాటి వీర కిరీటమైన
బ్రహ్మనాయఁడు గోసంగిపడుచు నందుఁ
గొడుకులను గాంచఁడే తనకొలమునందు
వన్నె వాసియు నతనికి సన్నగిలెనె? 35

ఆ. జాతిహీనుఁడైన జాబాలి పుత్త్రుని
సత్యకాముఁ డనెడు సచ్చరిత్రు
గౌతముండు బ్రహ్మజాతిలోఁ జేర్పఁడే
యెల్ల ద్విజులు దాసి కియ్యకొనరె! 36

---

(33) మహారాష్ట్ర భక్తవిజయము — ప్రకాశరావుగారి యుపన్యాసము, మానవసేవ

(34) ప్రకాశరావుగారి యుపన్యాసము. మానవసేవ.

(35) వీరభాగవతము, శ్రీనాథుని పల్నాటి వీరచరిత్రము.

(36) ఐతరేయ బ్రాహ్మణము.



తే. మున్ను 1 వ్యాదకర్ముఁడను నొక్క పుల్కసుండు
క్షితిసురోత్తముఁడై ప్రకాశింపలేడె!
అధమజాతి 2 యులోపి బ్రాహ్మణుఁడు గురుఁడు
ఋషివరుండును నై తేజరిల్లలేదె! 37

తే. మున్ను యాగక్రియాలోపమునను బ్రహ్మ
రాక్షసత్వంబు నొందిన బ్రాహ్మణునకుఁ
గైశికీ గీత మహిమ నక్కజము గాఁగ
మనుజరూపం బిడఁడె? యొక్క మాలవాఁడు 38

క. ధర్మరతుఁడు కౌశికమునిని
ధర్మవ్యాధునిగృహంబుఁ దరియఁగ నాతం

---

(87) 1 భవిష్యత్పురాణము 2 ఐతరేయబ్రాహ్మణము,
ఋగ్వేదము, పదియవమండలము

(38) శ్లో॥ఏవ ముక్తాతు మాతంగం రాక్షస శ్శరణంగతః....
శ్లో॥ యన్మయా పశ్చిమం గీతం స్వైరం కైశిక ముత్తమం
ఫలేన తస్య భద్రంతే మోక్షయిష్యతి కిల్బిషాత్
అను కైశికపురాణోక్తి క్రమంబున బ్రహ్మరాక్షసునియందు యజ్ఞాంగజోపాగతదోషంబుఁ బరిహరించి పరమభాగవతోత్తమునికై వడి.... .... ....ఆచార్యసూక్తిముక్తావళి, తిరుప్పాణియాళ్వారుల చరిత్రము. భక్తవిజయము.

(39) అరణ్యపర్వము, భారతము

దర్శిలిఁ బూజింపఁగ నా
నిర్మలుఁ డాయనఘుచేతి నీరముఁ గొనఁడే 39

క. అల్ల రంతిదేవుఁ డాహారమొసఁగక
నీరములను బ్రాణి నిలుపఁగోరి
యున్నయంత మాల యొక్కండు తనువేఁడ
నుదక మిచ్చి వాని నోమలేదె? 40

తే. పూర్వమును ప్రసేన జిత్తను భూపతిలకు
నందన కురంగి యన నొప్పు సుందరాంగి
మదగజము పాలు గాకుండ మనిచినట్టి
మాల కొమరునిఁ బెండ్లాండి కాలలేదె? 41

ఆ. మలయసింహుపట్టి మాయావతి యనంగ
వెలయు కన్యతన్ను వలచినట్టి

---

ఉ. అన్నము లేదు కొన్ని మధురాంబువులున్నవి త్రావుమన్న రా
వన్న! శరీరధారులకు నాపదవచ్చిన, వారి యాపదల్
గ్రన్నన మాన్పి వారికిసుఖంబులుసేయుటకన్న నొండుమే
లున్నదె? నాకుదిక్కు పురుషోత్తముఁడొక్కఁడెసుమ్ము! పుల్కసా

అనిచెప్పి రాజర్షియగు రంతిదేవుఁడు మాలవాని పాత్రలో నుదకము వోసెను. భాగవతము.

(41) కథాసరిత్సాగరము.

(42) అనుగమము=సహగమనము కథాసరిత్సాగరము



నుపహారుని మాల సుతు నుపలాలించి
వాని ననుగమించి వరల లేదె? 42

ఆ. ఉజ్జయిని పురాన నుత్పల హస్తుఁడన్
పేరి మాల వాని ప్రియ కుమారి
పలచి యా యవంతి వర్ధనుఁడను రాజ
సుతుఁడు పెండ్లియాడి సుఖముఁ గనఁడె? 43

తే. చారుతరకీర్తి శ్రీహర్ష చక్రవర్తి
సభను బాణ మయూరాది సత్కవీంద్ర

---

(43) కథాసరిత్సాగరము.

(44) ఇరువదియొకటవ కృష్ణా గుంటూరు మండల సంఘ సంస్కరణ సభాధ్యక్షులగు కొ. వేం. లక్ష్మణరావుగారిట్లు చెప్పియున్నారు. "నేను కొన్ని దినములక్రిందట "హర్ష చరిత్ర" మను మహారాష్ట్ర గ్రంథమును జదువుచుండఁగా నా కవింతచరిత్ర గానవచ్చినది. హర్ష చక్రవర్తి కాలమున "దివాకరుఁడను మాతంగు" డనఁగా మాదిగకులమువాఁడు గొప్పకవియై యుండెను. ఆతని విద్యామాహాత్మ్యమును జూచి శ్రీహర్ష చక్రవర్తి యాతనిని బాణ, మయూర మహాకవులతో సమానముగాఁ దన సభయందు సభ్యునిఁగా నేర్పఱచుకొనెను. అనఁగా మాతంగదివాకరుఁడు శ్రీహర్షుని యాస్థాన కవీశ్వరుఁడుగా నుండెను. రాజశేఖరకవి యిందునుగూర్చి యిట్లు వ్రాసియున్నాఁడు.

తుల్య సత్కార గౌరవాదులను గాంచి
తనరఁడె దివాకరుండు మాతంగజుండు? 44

తే. హృద్యతరమైన గాంధర్వ విద్యయందు
నైపుణంబును జూపి యానందమిచ్చి
శ్రీ హరిశ్చంద్ర చక్రవర్తికి మనంబు
వెతలు దీర్చిన వారు మాలెతలు గారె? 45

ఆ. యామునార్య శిష్యుఁడై, పరిపూర్ణ దే
శికవరేణ్యు వలన సేవఁ గాంచి
పెరియనంబిచేతఁ జరమక్రియలు గొన్న
మారనూరినంబి మాలగాఁడె?

గీ. కాశికాపురి నాదిశంకరుఁడు విజ్ఞుఁ
డైన చండాలు వలన సుజ్ఞాన మెరిఁగి
మెచ్చి యతనికి జగమెల్ల రిచ్చువడఁగఁ
బ్రేమ సాష్టాంగ దండప్రణామ మిడఁడె! 47

---

శ్లో॥ అహో ప్రభావో వాగ్దేవ్యాః యన్మాతంగ దివాకరః
శ్రీహర్షస్యాభవత్ సభ్యః సమో బాణమయూరయోః॥

(45) హరిశ్చంద్రోపాఖ్యానము, మార్కండేయ పురాణము.

(46) ఆచార్యసూక్తి ముక్తావళి.

(47) శంకరాచార్యుల మనీషా పంచకము. శంకరవిజయము, విశ్వేశ్వర పర్వము.



క. మాలిన్యంబును దలఁపక
ధీలలితుండైన బుద్ధదేవుఁడు గురుఁడై
మాలని లాలింపఁడె । నయ
లాలిత కరుణావిలాస లాలసుఁ డగుచున్ 48

ఆ. శుభ్రకీర్తి యగు నశోకవర్ధన చక్ర
వర్తి భిక్షువులగు పంచములను
భక్తిపూర్వకముగఁ బ్రార్థించి పూజించి
గౌరవించి ఘనతఁ గాంచలేదె? 49

తే. తొల్లి కణ్వమునీంద్రచంద్రుండు మ్లేచ్ఛ
దేశమైన ఐగుప్తు కేతెంచి యచట
వేలకొలఁది మనుష్యుల వేదమతము
నందుఁ జేర్పఁడె? వారు పూజ్యతను గనరె! 50

తే. వారిలోపలఁ బృథుఁడనువాఁడు క్షాత్ర
వంతుఁడై, భూమికాంతుఁడై మంతుకెక్కి
మగధ రాజ్యంబు స్థాపించి మాన్యుఁడైన
మాగధుం డాతని కుమారమణియె కాదె? 51

తే. ఎల్లహిందువులును నుపాసించు దేవ
గణములోపల మాతంగకన్య లేదె?

---

(48) బుద్ధచరిత్రము

(49) అశోక చరిత్ర.

(51) భవిష్యత్పురాణము.

అల్ల మాతంగవంశజు లెల్లవారు
హిందువుల దైవముల నుపాసింతుగ్రాదె? 52

ఆ. దిక్కు మొక్కు లేని దీనుల శవములు
శ్వపచకులు తెమోయ వలయుననుచు
సర్వ ధర్మ శాస్త్ర చయ మేక ముఖమై వి
ధింప దొక్కొ? బుధులు తెలియ రొక్కొ? 53

52 శ్లో॥ మాణిక్య వీణా ముపలాలయంతీం। మదాలసాం మంజులవాగ్విలాసాం। మహేంద్ర నీలద్యుతి కోమలాంగీం। మాతంగకన్యాం మనసా స్మరామి॥

శ్లో. మాతా మరకతశ్యామా మాతంగీ మధుశాలినీ
కుర్యాత్కటాక్షం కల్యాణీ కదంబవనవాసినీ॥

శ్లో. జయ! మాతంగతనయే! జయ! నీలోత్పలద్యుతే!
జయ! సంగీతరసికే! జయ! లీలాశుకప్రియే? కాళిదాసు.

శ్లో. ...... మతంగమునికన్యకాం మధురభాషిణీమాశ్రయే.
శంకరాచార్యకృత త్రిపురసుందరీస్తోత్రము.

శ్లో. జయ! మాతర్విశాలాక్షి! జయ! సంగీతమాతృకే!
జయ! మాతంగి! చండాలి! గృహీతమధుపాత్రికే!
శ్యామలాస్తోత్రము, బృహత్స్తోత్రరత్నాకరము
శ్యామలానవరత్నమాలాస్తోత్రాది ప్రమాణములనేకముగలవు

(53) శ్లో. అబాంధవం శవంచైవ నిర్హారేయు రితిస్థితిః.
(చండాలురు, శ్వపాకులు) బంధువులు లేక చనిపోయిన యనా



క. మలయాళము తీరంబునఁ
బోలు పారెడు తులువ దేశమును బంచములే
నెలకొని యేలరె? రాజ్యము
నెలకొలుపరె మున్ను? శౌర్యనిరతులు గారే! 54

క. నందుఁడ డసునతఁడు ప్రజలా
నందము నందంగఁ బాలనము సేయఁడె? ఆ
నందవరంబున నాతని
మందిర చిహ్నంబు లిపుడు మాత్రము లేవే? 55

క. ఆనందుని వంశంబున
కానందముఁ గూర్పఁ గనకుఁడను వాఁడుదయిం
బై నిఖిలవిద్య లారసి
జ్ఞానియు సుకవియును నగుచు ఖ్యాతినిఁగనఁడే? 56

ఉ. మాలలకన్న నీచతర మానవులా ఘోరగారు వంశ భూ
పాలుర కన్యఁ గైకొనఁడె? పావనుఁడై పరమయూర ధారుణీ
పాలునిపట్టి, మిత్రులుగ బ్రాహ్మణు లుండరె వారిసన్నిధిఁ
బోలగఁ బంచముల్ మరలఁబోన్న తినొంది సుఖంపఁబోలదే!

ధప్రేతము నెత్తవలయును. ఇది వారలకు ధర్మము. మనుస్మృతి.
దశమోధ్యాయము.

(54) (55) (56) సూర్యప్రకాశరావుగారి యుపన్యాసము, మానవసేవ. (57) సూర్యప్రకాశరావుగారి యుపన్యాసము, మానవసేవ. ,,స్త్రీరత్నం దుష్కులాదపి,, మనుస్మృతి.

ఆ. మందపాలుఁ డనెడు మౌనీంద్ర చంద్రుఁడు
కడు నికృష్టజాతి కన్య యయ్యు
సాధుశీలయైన సారంగిఁ బెండ్లాడి
యానసిష్ఠులీల నలరలేదె? 58

క. భూ శ చంద్రుఁడగు వి
శ్వా త్రుఁడు ఘోరతర తపశ్శక్తి మెయిన్
భూ రుఁడు, బ్రహ్మర్షి
గ్రామణి, ధీమణియునై ప్రశస్తిఁ గనఁడే 5

ఆ. భృగుమహర్షి చంద్రికృపవల్ల బ్రహ్మర్షి
యయ్యె వీతహవ్యుఁ డనెడు రాజు
అవని భర్తయైన యువనాశ్వ పుత్రుండు
భూసురత్వమొంది పూజ్యుఁడయ్యె. 60

క. మేనకకు గాధిపట్టికి
మేనత్తయుఁ గణ్వ కూరిమి కుమారికయై
రాణించు శకుంతల త
త్సూనుఁడు భరతుండు సుచరితులుగాలేదె? 61

(58) శ్లో॥ అక్షమాలా వసిష్ఠేన సంయుక్తాధమ యోనిజా
సారంగీ మందపాలేన జగామాభ్యర్హణీయతాం॥ మనువు
(5 ) వాల్మీకిరామాయణము.
(60) 1 భారతము, 2 భాగవతము.
(61) భారతము.



తే. పూర్వమున ద్విజులకు నందు భూపతులకు
నాలుగవ జాతివారె వంటలను జేయు
వాడుక యటంచు మునులును బ్రాహ్మణులును
సాపడెడు వారనుచుఁ గృతుల్ చాటుఁగాదె? 62

తే. చ్యవనుఁ డనుఋషి కులసతీ సహితుఁడగుచుఁ
గోయికుశిక ప్రభుని యంతిపురమునందు
సిద్ధమగు వంటకమును భుజించుచుండి
యచ్చటనె కాలమును బుచ్చెననఁగ వినమె! 63

తే. క్షత్త వండిన యన్నంబు బ్రాహ్మణులకు
విందువెట్టించి తినఁడె గోవిందుఁ డల్ల
విదురు నింటను గుడువఁడే ప్రియముతోడఁ
గులముఁ జూచెనె కృష్ణుండు గుణముగాక. 64

తే. ప్రాణములు పోవునట్టి యాపదలయందు
వేదవిదుఁడగు విప్రకలాదుఁడైన
జాతిహీనుల యన్నంబు సాపడినను
దోష మంటదనుచు స్మృతుల్ ఘోషలిడవె? 65

(62) భారతము,విరాటపర్వము.అది దోషము లేదనియు స్మృతి
(63) అనుశాసనికపర్వము, భారతము.
(64) భారతము,ఉద్యోగపర్వము.-శూద్రునకు రాచకన్యకయం
దుఁ బుట్టినవాఁడు క్షత్తయని మనుస్మృతి, 'దశమోధ్యాయం
(65) శ్లో॥ జీవితాత్యయ మాపన్నో యోన్నమత్తి యతస్తతః
ఆకాశమివ పంకేన న పాపేన లిప్యతే॥

ఆ. భూరిముఖ్య పుణ్యపుర సప్తకముఁ జొచ్చి
హైందవులను బలిమి యవనులెల్ల
మ్లేచ్ఛులుగ నొనర్పఁ గృష్ణచైతన్యుల
శిష్యవరులు మరలఁ జేర్చుకొనరె! 66

తే. చితన, చందను లనుపేర్లఁ జెలఁగునట్టి
యవనులను శుద్ధిజేసి హిందువులఁ జేసి
చిత్రి, చందాఖ్యలనుబెట్టి స్నేహభావ
మలర మెలఁగిరి మనపూర్వు లసఁగవినమె! 67

ఆ. వారుపుట్టినట్టి వంశంబులెవ్వవి?
వార లెంతలేసి వారలైరి?
జాతి యేదియైన నీతియే ముఖ్యంబు
నీతి లేకయున్న జాతియున్న. 68

బ్రాహ్మణుఁడు (చచ్చిపోవునంతటి) ఆపత్కాలమందుఁ బ్రతిలోమజాతి వాఁడు మొదలైన యెవని యన్నమును భుజించినను బురదయందలి యాకాశమువలె వానియందు గొంచెమేని పాపమంటదు. వామదేవ విశ్వామిత్రాది మహర్షులు దీనికుదాహరణములు. మనుస్మృతి, దశమాధ్యాయము.

66) రామభుజదత్తుగారి యుపన్యాసము,

67) జన్నారు శాసనమునఁ గలదని భండార్కరుగారు వ్రాసిరని రామభుజదత్తుగారి యుపన్యాసము.



తే. జందెములు దీసి పూర్వులు జాతి విడిచి
భ్రష్టులైనను ముందు తరంబు వరులు
ద్విజులుగావచ్చు శుద్ధులైతిరిగి యనుచు
మనువు మొదలైన వేత్తల మతముగాదె? 69

క. జననంబు చేతఁ జూచిన
జనులెల్లరు! గూడ నేక జాతియె యనుచున్
మనశాస్త్రములు సమస్తముఁ
బెనురొద మిన్నుముట్ట ఘోష పెట్టుటలేదే? 70

క. 1 హరినామ స్మరణము భవ
హరణము, 2 శ్రీరామ నామ మను మంత్రము శ్రీ
కరపుణ్యకరముగద! యీ
తరుణోపాయమునఁ బ్రోవఁదగుఁ బంచములన్. 71

(69) ఆపస్తంబ సూత్రములు, మనుస్మృతి.

(70) శతపథ బ్రాహ్మణము, భగవద్గీతలు, భాగవతము, రామాయణము, భారతము, సాంఖ్యశాస్త్రము, బృహదారణ్యకోపనిషత్తు మొదలగునవి. ఒక యుదాహరణము.

శ్లో. న జాతిః పూజ్యతే రాజన్ గుణాః కల్యాణకారకాః
చండాల మపి వృత్తస్థం తం దేవా బ్రాహ్మణం విదుః.
భారతము, అశ్వమేధపర్వము.

(71) 1 విష్ణుపురాణము, 2 గరుడపురాణము.

తే. నాగరికు లైన యార్యు లీభాగమునకు
రాక ముందటి నుండి స్థైర్యముగ నుండి
ఆంధ్రభూమికిఁ గాఁపు లైనమాల
వాండ్ర నిటుఁ ద్రోసి పుచ్చుట పాడియగునె? 72

మ. మన దేశంబున జన్మమెత్తి మన క్షేమంబుల్ సదాకోరి తా
మనయంబున్ మనసంఘవృద్ధికై దాస్యంబొప్పఁగాఁ జేయుచున్
మన దైవంబులఁ గొల్చుచున్ మన మతామ్నాయప్రకారంబుగా
మనుచున్నన్ మన దేశ సోదరులె యన్నాటన్ విచారింపమే! 73

మ. మనకున్ సోదరవర్గమై మనుచు నుండీ! మాలల్ సహా; హిందుభూ
జననీగర్భము నందె గాంచిరి సుండీ! జన్మంబు; నీ దేశ మం
దున సర్వేశ్వరుసత్కృపన్ గలుగు వస్తువ్రాతమున్ బొందఁగా
మనతోఁ బాటధికారమున్నది సుండీ! మాతంగపుంజాతికిన్

ఉ. దేవుఁడె కన్నతండ్రి జగతిన్ జనియించినవారికెల్ల; భూ
దేవియె కన్నతల్లి, యిది తెల్లము; మానవకోటి యెల్లరున్
...వికి నన్నదమ్ములు: లఘుత్వఘనత్వములున్ స్వభావముల్
వౌ; యిఁక వర్ణభేదములు కాల్పనికంబులు; లాతిసీమలన్
లేవివి; వీనివల్ల లవలేశము లాభముఁ గల్గఁబోదు; ము
న్నే విధివృత్తులన్ గురించియే నియమించిరి పెద్దవారు; లే
త్రోవలఁ జూచిరిన్ శుచికిదూరగులౌట నెమాలవారలన్
బోవిడనాడినారు మనపూర్వులు ప్రస్తుత దేశకాల పా
త్రావసరంబులన్ గని యుదారమనస్కులు దేశనాయకుల్



దీనుల యీయభాగ్యులకు దిక్కయి నిల్చిరి, తొంటినీచపుం
భావము మారిపోయినది పండితకోటికిః నేఁటికింకనున్
గేవలపూర్వపద్ధతుల కేర్పడఁబోవఁ దలంచుపూన్కి తా
నేవగనైన నేఁటి కెదురీదుటవంటిది; కాలమే గతిన్
బోవునొ తానునాగతిని పోవుట కోవిదలక్షణంబగున్
గావున దేశ కాలముల కైనడు కారసి నిమ్నజాతులన్
గావలులంచుఁ బోవిడక కారుణికోత్తములెల్ల బ్రోవరే! 75

సీ. ఊరిలోఁ గాపురముండ నీకుండుట
నీళ్ళ రేవులఁ జేర నీకయుంట
వీధిలో స్వేచ్ఛగా విహరింపనీకుంట
నీచభావముతోడఁ జూచుచుంట
పల్లెకూటములకు వెళ్ళనీకుండుట
మోసాలలోపల ముంచుచుంట
వైద్యసాహాయ్యంబు నొసఁగనీకుండుట
మతధర్మ నియమముల్ మప్పకుంట

తే. వాహనారోహణాది కౌతూహలములు
నాటకాలోకన వినోదనాదికములు
లేకయుండంగఁ జేయుట లెక్కపెట్టఁ
గలమె? మాలలఁ బెట్టు నిక్కట్టు లకట! 76

మ. మన దేశీయుల నేకజాతినరులన్ మాలిన్యమంచున్ నిమ్మన్
మన మన్యాయము మాలఁద్రోచి, కరుణన్ మాయించి స్వ

త్వంబులె! ల్లను దుర్వృత్తిహరించి హింసలిడుచున్:
లాతుల్ వెతల్ జెట్టఁగ! న్గాని హా! హా! యని యంగలా
ర్చెదము లోకుల్ విన్నచో నవ్వరే! 77

చ. దయయునుధర్మముల్ గడకుదారిచి వేలకొలంది యేండ్లనుం
డియునిటుమాలవాండ్రనుగడింది బెడందలబెట్టుచుంట నెం
తయుఁ బరిపాటియై మనకు దారుణవృత్తిగఁ దోచకుం
డుఁగా! క యితరులివ్విధంబుఁబొడఁగాంచినగుండెలువ్రీలి
చావరే! 78

మ. నరజన్మంబిదియుత్తమంబనుచు నానాదేశవిద్వాంసులున్
వరుసన్ రూఢియొనర్చినట్టి పలుకుల్ వ్యర్థంబుఁగావించియి
ట్లరరే! మడ్డిమృగాలు మానవులువియ్యంబందుచున్నారు భూ
సురులా రాదయఁజూచిపుల్కసులకున్ శుద్ధత్వముల్ నేర్పరే

ఉ. పావనులెల్ల మానవులు బాపులు పంచములన్ననీచపుం
భావములోనఁ బంచముల భావనచేసిరి ఛాందసద్విజుల్;
కేవలపామరుల్ గనుక, కృత్రిమమేమియెఱుంగలేక, యీ
కైవడికొప్పి, పంచములు గట్టిగఁ గ్రించులమంచునమ్మి, య
ద్భావముతోడుతన్ భయము, భక్తి గడల్కొనగా ద్విజన్ములన్
దైవములంచుదమ్మెపుడు ధన్యులఁజేయుడు రంచు నెంచుచున్
సేవలు చేయుచుండి తమ జీవితమెంతయు గష్టపుంజమై
చేవయు లావునుం జెడగ జెడ్డడి, గీడ్పడి యాత్మగౌరవం,
బేవయు లజ్జయున్ మరచి పోయి గతిన్ జరియించియీవగన్



జోవడి కొండుచుండినను హా! యనినొవ్వరు భారతీయులా
హా! విపరీతధర్మముల యాగడముల్! జననంబుచేతనే
పాపులుఁబుణ్యులౌదురెప్రపంచమునందిటులెందునేనియున్

ఉ. కాకులుఁ బిల్లులున్ జెనకికైకొనఁగాఁగనుకొన్న యన్నమే
సాకును లేక భూసురులె సాపడుచుందురు, వింధు వెట్టగాఁ
బాకముచేసి రాసులుగ వైచిన యన్నముఁ జూచి కుక్కలే
తాకిన నెగ్గుసేయరు కదా! కనరాదె గోడారు? లహ్హహా 81

గీ. రాళ్ళ రప్పలఁ గనుఁగొని రహిని మ్రొక్కి
చెట్టులను బుట్టలను బూజసేయునట్టి
హిందువులుతోడి నరులను హీనులనుచు?
దలగఁ ద్రోయుట మతవిరుద్ధంబు కాదె? 82

తే. ఈశ్వర ప్రతిరూపమై యొసఁగు నరుఁడు
నరుని కగు నవమాన మీశ్వరుసఁ జేరు
మానవుల నవమానించు హీనవరుఁడు
పాత్రుఁ డగు నీశ్వర ద్రోహ పాపమునకు 83

చ. తెలివిదొలంగియున్న దురదృష్టులు, నీచులు గర్భదాసులున్
బలితవుదైన్య దుర్గతుల బాముల నొందెడు మందభాగ్యులున్
మలినులు, మానహీనులగు మాలలు సోదరులం చనోటితోఁ
బలికిన, వీనులన్ వినిన భారతకోటికి సిగ్గుగాదొకో? 84

చ. మనువున కప్రతిష్ఠ, ఋషిమండలికెల్లను నల్లచుక్కయౌచ
క్కని మన వేదశాస్త్రముల ఖ్యాతికి తెచ్చినమచ్చధర్మమున్

ఖలులయి వన్నె గన్నమతకర్తల కీర్తికళాకళంక మీ
యనుచితప్రవృత్తి బోఁడిది యార్యులఖండయశంబునొందరే

సీ. ఒడలిపై చర్మమే|యొలిచి దానము చేసె
నసఘుండు కర్ణుఁడెందవతరించె?
పులుగుకై మేని కండలు కోసి యిచ్చిన
శిబి మహాదాత యేక్షితినిఁ బుట్టె?
ఎదఁగొంకు లేక వెన్నెముక నే యొసఁగిన
ఘనుఁడు దధీచి యెక్కడ జనించె?
పసుపుఁబట్టలతోడఁ బ్రాణమే యిచ్చిన
జీమూతవాహుఁ డేసీమఁ బొడమె?

తే. అట్టి యీ ,,పుణ్యభూమి,, యం దక్కటకట!
యగ్రజాతుల వారు మాధ్యంబు కతన
సాటి మానిసులను బానిసలను జేసి
గాసి నొందించుచున్నా రకారణముగ. 86

సీ. పవలు రేల్కష్టించి వ్యవసాయ మొనరించి
యుర్వినిఁ బండించు చున్నవారు
పోరిది మీటఁగ మంచి పాదరక్ష లొసంగి
యొరు సౌఖ్యమును గూర్చు చున్నవారు
ప్రతి గ్రామమున మృత పశు కళేబరముల
నోర్మితోఁ దొలగించు చున్నవారు
గ్రామ రక్షణకునై యామికత్వము భరి
మొప్పారఁ గావించు చున్నవారు



ఆ. ప్రీతిమై ననాథప్రేత సంస్కారమ్ము
లెన్నొ యెడలఁ జేయుచున్నవారు
మనకు మేలు గూర్చు మాలల విడనాడఁ
దగునె! యిది కృతజ్ఞ ధర్మమగునె

ఉ. వెన్నముగొట్టువారి నవివేకత రాతను మొత్తునట్లుగా
నన్నిటికిన్ సదామనసమాశ్రయమున్ మదిగోరియున్న యా
పన్నులనీయమాయికులఁ బంచములన్ దయమాలి యీగతిన్
జన్నములొందఁ జేయుటలు భావ్యమె? భారతులార! చెప్పరే!

సీ. వాలిసం వెలుంగు, గాలియు వచ్చు వి
శాలమై తగు ప్రదేశాలు లేక
కరవుకోజులలోనఁ గాయ, కసరు, దూసు,
దుంపయే కాని మెతుకులు లేక
మురుగు కాల్వలుఁ బెద్దమురికి గుంటలలోని
నీరుఁ దక్కఁగ మంచి నీరు లేక
ఎండవానలనుండి హిమపాతములనుండి
రక్షింపఁ జాలు వస్త్రములు లేక

గీ. జాడ్యములు పుట్టి యేటేట శ్వపచకులము
నాశనమ్ముఁ జేయుటయె గాక దేశమెల్ల
నంటువ్యాధులు వ్యాపించి యఖిలజనుల
ప్రాణముల దీయుచున్న విషయము వినరె! 87

సీ. మాల మాదిగలును మనవంటిమనుజులే!
వారి ప్రాణము మన ప్రాణమొకటె!
సర్వావయవములు సర్వేంద్రియములును
సర్వమానవులకు సమముగాదె?
నీర మాహారము నిద్రయు మనకును
వారికిఁగూడ నావశ్యకములె!
వారల దేహంబువలె మన దేహంబు
రక్తమాంసాదుల రాశియగును?
తే. మోదఖేదాలు, సుఖదుఃఖములును, మరియుఁ,
బుణ్యపాపాలుఁ, గలిమిలేములును సరులె!
ఉభయులకు హెచ్చులొచ్చు లేమున్నవింక?
మనను మౌర్ఖ్యంబునెనసి క్రిమ్మరదుగాక!
సీ. మాల మాదిగలకు మనకున్న యట్టులే
కలదు సుఁడీ! బుద్ధి; కలదు తెలివి
ఆశలెల్లను గల వాసక్తి కలదు ఉ
త్సాహశక్తియును దీక్షయును గలవు
కలదోర్పు నభివృద్ధి కాంక్షించు సద్గుణో
త్కరమెల్లఁ దక్షతవగాక కలవు
కలిగియు ఫలములేక నశించుచున్నవి
మన మంతరాయముల్ పెనుచుకతన
తే. వారలును వృద్ధి నొందంగ వలయునన్న
భగవదుద్దేశ్యమును గూడ భంగమయ్యె



భారతాభ్యుదయమున కపారమైన
భంగము ఘటిల్లె మనస్వార్థపరతకతన. 91
సీ. భక్తిప్రపత్తుల భాసిల్లఁగలరంచు
నమ్మింప మాలవైష్ణవులు సాక్షి!
తౌర్యత్రికాది చాతుర్య ధుర్యులఁటంచుఁ
బ్రకటింప మాలనాటకులుసాక్షి!
జవ సత్వధైర్యాతి శౌర్యాంకులని చాటి
చెప్పంగ మాల మాష్టీండ్రుసాక్షి!
కరకౌశలాది శ్రీకర గుణాఢ్యులఁటంచు
వాదింప మాలశిల్పకులుసాక్షి!
తే. సకల సుమనోవినోదన చర్యలందు
వలఁతులన మాలదేవరవాండ్రు సాక్షి!
బహుళతర రాజ్యకార్య నిర్వహణశక్తి
శాలురన మాలయుద్యోగిజనము సాక్షి! 92
ఉ. పోలినచాకచక్యమున భూముల శిస్తు వసూలు చేయుచున్
గ్రాలుచునుండి రేకవ్రమరాటధరిత్రిఁ ద్రిలింగధాత్రిఁ బూ
ర్వాలురు గూర్చినట్టి ధనరాసులు కోశముఁ జేర్చరే కదా!
మాలల యోగ్యతల్ దెలుప మానితవృత్తములివ్విచాలవే?
సీ. ఎందఱు కపిల మునీంద్రు లీమాలల
యం దుద్భవించి పెంపొందువారొ?
ఎందఱు నందనరేంద్రు లీపంచము

లందు జన్మించి ఘనఁ బొందువారొ?
ఎందఱు కనకకవీంద్రు లీమాతంగు
లం దుదయించి సొంపొందువారొ?
ఎందఱు శ్రీపాణిచంద్రు లీగోసంగు
లందు జనించి చెల్వొందువారొ?
తే. ఎందఱెంద ఱరుంధతు లీఃపాదు
లం దవతరించి సత్కీర్తి నొందువారొ?
ఏపుగననీక మాలల హిందుజాతి
స్వార్థరతి నాత్మనాశంబు సలుపుకొనియె. 94

ఉ. ఆరయ హిందుదేశమున నైదవభాగము నిమ్నజాతు లు
న్నారుగదా! నిరంతరము నైచ్యపుభావముతోడఁ జూచినన్
వారలు వైరమూని మనపైని; మతాంతరులై, ద్విదాత్వమే
పారఁజరించినన్ మరల భారతవర్షము వృద్ధిఁ జెందునే. 95

ఆ. సర్వ భారతీయ జాతీయతా నిని
ర్మాణమునకు యవన క్రైస్తవులయు
స్నేహ మవసరమని చెప్పుచుండియు హిందు
జాతిఁ జీల్చివేయ నీతియగునె? 96

సీ. నరుని శరీరంబునకును మస్తిష్క మెం
తటి యగత్యంబొ పాదములునంతె.
మెదడు లోపించిన మొదలె జ్ఞానము లేదు.
పదములు లేకున్న మెదలరాదు.



సంఘంబునకు నగ్రజాతి ముఖ్యతయెంతొ
కడపటిజాతి యక్కరయు నంతె!
అంగంబులకు రక్తమాధారమట్టులో
జాతుల కెల్లను జ్ఞానమట్టె!
ఆ. సంఘదేహమెల్లఁ జక్కఁగా లేకున్న
సంఘమంత కార్తి సంఘటిల్లుఁ
గాన జాతులెల్ల జ్ఞానంబు నొందక
ముక్తి లేదు సంఘమునకు నిజము! 97

ఉ. గోవులయందు హిందువులకుం గలభక్తియు మ్లేచ్ఛక్రైస్తవుల్
గోవధఁ జేసి మాంసమును గోరి భుజించుట తెల్లమే కదా!
కేవల పాపచిత్తులని క్రించుఁదనంబు వహించి మాలలం
గ్రేవలఁ జేరనీక యడికించిన వారలు తన్మతస్థులై
గోవులఁ జంపి మాంసమును గొంకక జంకక మెక్కుచుంటచే
గోవధ నాఁడు నాఁటికిని గోట్లకొలందిని వృద్ధిఁ జెందెఁ; హా!
గోవులయందు భక్తిగల కోవిదులైనను మాలవారలన్
బావులగాఁ దలంప కతిపావన భావులఁ జేసి ప్రోవరే! 98.

చ. జగమునఁ దోడిజాతులటు సర్వవిధంబుల వృద్ధి నొందుచున్
సొగసులఁ దొంతులై మిగుల శోభిలుచుండఁగ, దేశదక్కియా
నగమనజాతి యార్తిఁ బడి వాసిదొఱంగుటకున్ గతంబిటుల్
పగగొని మాలలన్ బరచు పాపఫలంబునకన్న నున్నదే! 99

ఉ. కాలిమితోడ నీశ్వరుని దర్శనమున్ బొనరించు వొందె వాం
ఛాలమునందు సూనరుల పంక్తిని నొప్పెడు మాలజాతి దే
వాలయమున్ జొరంగఁ దగు యత్నము సేయు టెఱింగి యగ్రవ
ర్ణా లెదిరించి నిల్చినఁ, బరస్పర వైరము హెచ్చి కోర్టులన్
వేలకొలంది విత్తమును వెచ్చము సేయుచుఁ బోరినన్ జయ
శ్రీ లభియింపకున్కఁ గడు సిగ్గిలి బెగ్గిలి యేమిచేయఁగాఁ
జాలక హీనజాతి యొడఁ జాలన సఖ్యమునొంది, యెంతయున్
జాలినిఁ జెంది, పూనిరులు స్వామిక, సాంఘిక, గౌరవ స్వతం
త్రాలను గోలుపోయి సుతరామును సౌఖ్యము లేని జీవనం
బేలయలంచుగోని, తమ బేలతనంబును మూలద్రోసి, పం
తాలుదలిర్పఁగా యవనధర్మముఁ గైకొని, యొక్కమాటుగాఁ
జీలుకపోయి మల్కలను జేరిరి పూర్లకొలంది మంది, పాం
చాలమునందె మేఘులను జాతికిఁ జేరిన మాల లెక్కడన్
గ్రోలఁగఁ బ్రాణముల్ నిలుపఁగ్రుక్కెడు నీళ్ళను జిక్క కొక్కెడన్
మేలగు బావిలోపలను మ్లేచ్ఛులు హిందువులందు సర్వవ
ర్ణాలమనుష్యులున్ గలసి బ్రాహ్మణశూద్రవిభేదభావమున్
గాలికిఁద్రోలి మాధ్యమును గాలిచి పేలిచి రేమొ యన్నటుల్
మూలిమితోడఁ దోఁచుచు జలంబులు చేఁకొనుచుండఁ జూచి మే
ల్మేలని మెచ్చుకొంచుఁ బనిమేఘులు తామునుకూడ బావిలో
నీళులు చేదుకోఁదలఁచి, నెయ్యము మీరఁగ జేరరాగ; గ
గ్గోలుజనించి మొల్లరను గోలయొనర్చుచు నక్కటక్కటా!



కాలము కాలిపోయినది, కానితలంపులు పుట్టుచుండెఁ, బో
గాలమువచ్చె మేఘులకు, గర్వము హెచ్చెను, కండక్రొవ్వునన్
బాలికివచ్చి కూపమును మైలయొనర్చిరి; యింతఘోరగ మే
కాలమునందు నున్ గలదె? కార్యము లేదిఁక, వర్ణధర్మముల్
పాలన చేసికోఁగలుగు పాటి యుపాయము లేదు, నీమముల్
తూలకనిల్వవింక, ద్విజులున్ గులధర్మములన్ గణింప; రా
శీలము మాఱిపోయినది, చెల్లెను న్యాయము, నీతిలేదు, దౌ
ష్ట్యాలకు మేరలేదు, నలుసంతయుఁ బాపపు భీతి లేదు; హా!
కూలెను వేదధర్మమని కొందఱు కుయ్యిడుచుండ, నాలుకల్
గ్రోలుచుఁ గోపతాపములఁ గొందఱు శాపములిచ్చుచుండగ
య్యూళ్ళకుఁ గాలుదువ్వుచు, గయాళితనంబున బాల వైదికుల్
రాలను రువ్వుచున్, మిగుల రాయిడి సేయఁగఁ దక్కువారలున్
గోలలు బూని కార్యమునఁ గొట్టుచుఁ దిట్టుచు వెంటనంటఁగాఁ
బోలదు! పోలడన్న యొక పుణ్యుఁడు సైతము లేక, దీనులై
కాలికొలందిఁ బర్విడి, గ్రక్కున నిండ్లను జేరి యింక నే
వీలున హైందవ ప్రజలు పెట్టెడు బాధలనుండి తప్పుకోఁ
జాలుదుమంచు జాలఁగ విచారణ చేసి, యుపాయమెంచి యున్
వేలకొలంది మేఘు లొకపెట్టున మ్లేచ్ఛమతంబుఁ జొచ్చి ధీ
శాలురు బ్రాహ్మణాది జనసంఘము తెప్పునఁ దెల్లవోవఁ జా
టాలయి, మిత్రులై తగు పఠానులు సాయమునకువచ్చి నిల్వ, ను
ద్వేల ముదబ్ధిలో మునిఁగి తేలుచు, వేడ్కల నోలలాడుచున్
గాలము పుచ్చుచుండిరి సుఖంబుగ; మేఘులు మ్లేచ్ఛులైనఁ గ

ల్లోలము లేదు కూపములలోని జలంబులు దోడు వేళ; బం
గాళమునందు గోవధలు కారణముల్ గను మ్లేచ్ఛభారతీ
యాళికి సంభవించు కలహంబులలోపల నామశూద్ర లే
పాళికిఁ జేరకుండ నిరుపద్రవములన్ బయినుండి చూచుచున్
దాళము వేయుచుండిరిగదా! శ్వపచుల్ గద వారలెల్ల! నీ
పోలిక వారితో మనము మూఢవివాదలు పెంచుకొన్నచో
వీరల దేహిందుజాతి యతివేలఁపు సాంఘికవిప్లవంబునన్
గూల దె హిందుదేశ? మిదికూడునెఁ తోడిజనంబు నవ్వఁగాఁ
బాలయి పోరె హిందువులు? పాపఁపు నాశనదేవతాముఖ
క్ష్వేళకరాళకీలలకు జిక్కి నశింపదె హిందుధర్మ? మిం
కేల విలంబముల్; తగినకీలకముల్ గనిపెట్టి చక్కఁగా
మాలల సంస్కరించి తగుమన్నన చేయుచు దేశ కాల పా
త్రలను జూచి సద్విజవతంసులు గర్వముఁ దక్కి, సభ్యదే
శాల మనీషులం బలె విశాలములౌ హృదయాలతోడు తన్
గ్రాలుచు, "నెన్నివర్ణములు గల్గిన హైందవులెల్ల నొక్కటే
మేలగు జాతి" యంచుఁ దమిమీరఁగఁ జాటుచు హిందుదేశధ
ర్మాలను నుద్ధరింపరె? సమస్తవిధంబులఁ గీర్తినింపరె? 100

తే. క్రైస్తవ మహమ్మదీయ ధర్మంబులందుఁ
గలియు వారందరును నీచకులము వారె
సాంఘిక స్వామ్య గౌరవాసక్తిఁ గాక
తారతమ్యం బెఱిఁగి చేరువారె వారు? 101



గీ. వంగదేశీయు లిప్పుడీ భంగపాటుఁ
గాంచి పంచములను గౌరవించుచున్న
వారు; మరియు, మహారాష్ట్ర ప్రజలుఁ గూడ
యుక్తరీతినిఁ బ్రేమించుచున్నవారు. 102

ఉ. మాలకులంబు కన్న గను మాంద్యము గల్గిన జాతులెన్నొ వై
మాలముగాగ నున్నను, సమస్త జనంబులు మాలవారినే
తేలిక చూపుఁ జూడఁ గలదే తగు కారణమేదియైన? నే
కాలమునందొ మాలలకుఁ గల్గెను నీచత; నాఁటినుండియున్
జాలుగ వచ్చుచున్న యది చాలశకంబులనుండి, యెవ్వరీ
జోలికి రారు, సత్యమును జూడఁ దలంచిన యెవ్వరైన నీ
"మాలల కెట్టులేర్పడియె మైల" యటంచును బ్రశ్న సేయమా
మూలుగ వచ్చుచున్నదని మూల్గుట మాత్రమె కాని, యిట్టిదీ
మాలలయందు లోపమని, మాలలు చేసిన పాపమంచు నీ
మూలముచేత మాలలను ముట్టగ రాదను వారు లేరు; ఈ
వేళను మాలవారికినిఁ బెక్కులు హీనకులాల వారికే
లీలఁ బరీక్ష చేసినను లేశము భేదముకద్దె? యింతకున్
మాలల నీచగాఁ బ్రజల మాంద్యమె హేతువుగాగ దోచు; సం
తేల నెటాలు దేశమునఁ దెల్లని వారికి నల్లవారిపై
వ్రేలక యున్న యీర్ష్యయును ద్వేషపుబుద్ధియు లేదుగాన; నీ
మాలలవల్ల దోష మణుమాత్ర లేదని బోధ చేసినన్
మేలము వెఱ్ఱిగాఁ బ్రజలు వేసక తక్కిన నిమ్న జాతులన్

మాలిమిజూచి నట్లముున మానక చూతురు కాన సద్ద్విజుల్
మాలలపుట్టుపూర్వములు, మాలలు నీచతగన్న హేతువుల్
మాలమునుట్టుగా బ్రజకుబోధయొనర్పరె? మేలుగూర్పరే?

ఉ. పామరులైన హిందువులు పందలు వేలును నన్యధర్మముల్
దాముగ్రహించుచుండు టకుదత్తులమున్ మనయగ్రవర్ణము
పేమను నీచభావమున వేసరజేయుట హేతువై నను
దాసునవృత్తిమై బరమతస్థులు హిందుమతంబుమీదటన్
దీసున మొప్పమోపునసనిందలు సాయములౌనుగాన ను
ద్ధామయశంబుగన్న స్వమతంబు మహాత్త్వము చాటిచెప్పి బో
ధామృతవృష్టిలోకమును దన్పివిమూఢులసంశయంబులన్
శ్రీమహితాత్ములైతొలగఁజేయరె? సత్యమెఱుంగజేయరే?

ఉ. జ్ఞానవిహీనతన్ శ్వపచ జాతుల కీదురవస్థకల్గె, ను
జ్ఞానధనంబు విద్దియ యొసంగును కావున విద్య నేర్పినన్
మానవధర్మముల్ దెలిసి మానుగ వర్తిలియీమతంగజుల్
మానవులై చరింతు రభిమానము మానము జ్ఞాన మేర్పడన్

గీ. ఈయుపాయంబుఁ దలఁచి దేశీయులందు
సంఘభక్తులు, సంఘసంస్కారపరులు
మాలలకు జ్ఞాననేత్రంబు మమత నొసఁగ
జతనములు సేయుచున్నారు శక్తికొలఁది 106

గీ. పంచముల దుస్థితినిఁగాంచి పరితపించి
వారి దీనతఁ బాపఁగా గోరియున్న



సజ్జనుల సత్కృపను బాధలా లతెన్నొ
వెలసినవి; యొల్లెడల నింక వెలయఁ గలవు, 107

గీ. ఇతర దేశీయులగు క్రైస్తుమతము వారె
మాలల యభాగ్యతకుఁ జాల జాలిఁజెంది
వారి బాగునకై శ్రమంపడుచునుండ
మన ముపేక్షవహించుట మంచిదగునె? 107

చ. అరయగ వంగ దేశమునయందు వసించెడు నామశూద్రులే
తరగతిలోని వారలెకదా! మనసంఘము వారు వారి నా
దరణము సేయకుండిన కతంబున నేకద! వేన వేలుగాఁ
దురకలఁ జేరి హిందువులదూరుచునుండిరి మేఱవీరాఱుచున్

క. మలకలలోపలఁ గొందరు
కలసిరి హిందువులు మఱియుఁ గ్రైస్తవులందున్
గలసి రిఁకఁ గలయుచుండిరి
వెలివేయుచు మన మగౌరవించుటవలనన్.

చ. ఇతర మతంబులందు మనహిందువులందరు చేరుచుంటయా
మతములలోననుండు పరమార్థమెఱింగి కాదునుండి! ఈ
మతమున నెట్టిలోప మును మాత్రము కద్దనుకాదునుండి! న
మ్మతము గ వారలందఱికి మానముగాగనుచుంటహిందువుల్
హితవులిజూడకుంట యను హేతువులింతయు ధార్థమెంతయున్.

చ. పరువుగ నెల్లవారి సమభావమునన్ మన మాదరింపమిన్
దరచుగఁ బామరుల్ పరమతంబులలోపలఁ జేరుచుండి రీ

కరణిఁ గోట్లకొద్ది ప్రిటక్రిన్నన నన్యులఁ జేరిపోయిరక్
హారహార! దుస్సహంబగుచు హైందవసంఘము రూపుమాయదే?

సీ. సర్వ సమత్వంబుఁ జాటుటచేఁగదా!
క్రైస్తవ మతమెల్ల కడలనిండె
సర్వ సమత్వంబుఁ జాటుటచేఁగదా!
బౌద్ధధర్మము జగద్వ్యాప్తమయ్యె
సర్వ సమత్వంబుఁ జాటుటచేఁగదా!
ఇస్లాము మత మెల్ల యెడల వెలసె
సర్వ సమత్వంబుఁ జాటమిచేఁగదా!
హిందూమతంబు నశించుచుండె
తే. ధర్మమణియైన హిందూమతంబు నందు
సర్వమంగళ మయ్యెనే సర్వసమత
లేదు! లే! దది లేకపోలేదు! గాని
ఆచరణలేక "వుండి లేనట్టు" యయ్యె. 113

మనమెంత మాలల మణఁగఁ ద్రొక్కినవాగ
రౌన్నత్యమును బొందుచున్నవారు
దైవ సత్కృపను విద్యాభ్యాసమును జేసి
యుద్యోగములు చేయుచున్నవారు
జ్ఞానంబు వడసి నాగరకత్వమున మించి
యారుశుచిత్వము నొందుచున్నవారు



పరమతంబులఁ జేరి పరులప్రాపుననుండి
సన్నుతులను జెందు చున్నవారు
తే. వారికొక్కింత యధికార పదవివచ్చి
నన్నుఁ దల మీఁది వేల్పు లౌచున్నవారు
వారినిపుడేని మనలోనఁ జేరనీయ
నొప్పకున్న దేశమునకు ముప్పు రాదె? 104

సీ. ఆర్య సామాజికు లతిదయా దృష్టి నం
త్యజులఁ బ్రోవఁగ దీక్షఁ దాల్చినారు
బ్రహ్మ సామాజికుల్ ప్రబలానురాగులై
వారిపైఁ దమ చూడ్కిఁ బరపినారు
సమత దివ్యజ్ఞాన సామాజికులుఁగూడ
వారిఁ గాచెడు కోర్కి మీరినారు
రామకృష్ణ వివేక సామాజికులు సదా
వరి యభ్యుదయంబె కోరినారు
గీ. అల బరోడా మహారాజ తిలకు వంటి
స్వపరి పాలిత సంస్థాన సత్ప్రభువులు
వీరపురి సూర్యరాయాది పృధివి పతులు
వారి రక్షించు దారినే చేరినారు 115

మ. కలయన్ జూచిన నెందు జన్ములును దుంగల్ గానిబల్
చెట్లుఁ, బుట్టలుసొం, గుట్టలు, గట్లు మిట్టలును జూడన్
రాని కొల్లేటి భూములలోఁ దోమలబాధఁ బాపుకొను

నేర్పులేక ఘోరార్తిమై। నిలువన్ జాలని నోరులేని పసు
లన్ వీక్షించి డెందంబు వి। హ్వలమై నిల్వన నీరుగాఁ
గరఁగి హా! హా! యంచు నిట్టూర్చి య। గ్గలఁపుం జాలి
నిఁజెంది తత్పశులకున్ గండాతివారించి యొ। వ్వలనన్
సౌఖ్యముఁ గూర్పఁ బెక్కుశిలలన్ బాతించిపుణ్యాత్ములన్।
బలుపుణ్యాత్ముడటన్న కీర్తిగనె నెవ్వాఁడానృసింహోప్పరా
యలుజన్మించినయాంధ్ర దేశమునఁగట్టా! యట్టికారుణ్య
మూ। ర్తులు, ధర్మాత్ము, లుదార సాహసులు, ధీరుల్,
కార్యశూరుల్, మహో। జ్జ్వలకీర్తుల్, సుచరిత్రు లెవ్వార
యినన్ జన్మించి, యిమ్మందభా। గ్యుల, నీమాలల నుద్ధ
రించి కృతకృత్యుల్గాఁ ప్రకాశింపరే? 116

సీ. మనప్రభుత్వంబువా గనుకూలురై పంచ
ముల నుద్ధరింపఁ గా దలఁచినారు
పంచమ జాతికి బ్రహ్మజాతికిఁ గూడ
శాసనా లొకరీతిఁ జేసినారు
మాలల బడుల కిమ్మడిగా ధనం బిచ్చి
ప్రోత్సాహమును జేయు చున్నవారు
అందరితోడ న్యాయస్థానముల యందు
నన్ని స్వత్వము లిచ్చి యున్నవారు
తే. సరి సమానంబుగా నెల్ల జాతులకును
బన్ను బందులు విధియించు చున్నవారు
ధూమశకటాదులను లోప మేమి లేక
యెల్లరికి నొక్క యధికార మిచ్చినారు. 17



సీ. మనుపరే! యీదిక్కు మాలిన మాలలఁ
గరుణాంతరంగులై క్రాలువారు
పెనుపరే! యీసరుపేద మాతంగుల
దీన బాంధవదీక్షఁ బూనువారు
కావరే! యీకనికరఁపు బానిసలను
బరమ ధర్మాత్ములై పరగువారు
ప్రోపరే! యీతెళ్ళఁబోని మానినులను
బుణ్యచారిత్రులై పొలుచువారు
గీ. ఆదరింపరే! యీశునిఖాదనులను
సతత లోకోపకారులై బ్రతుకువారు
దాపుజేర్పరే! యీ చిరదాస్యయుతుల
నార్త రక్షణ శీలురై యలరువారు 118

తే. నిమ్న జాత్యుద్ధరణమన్న నీచజాతి
జనులకును జ్ఞానధనమిచ్చి జడతమాన్పి
మౌఢ్యమును మడ్డితనమును మాయఁజేసి
హైందవులకెల్ల సభ్యత నలరఁజేసి
ప్రజలలో భ్రాతృభావంబుఁ బాదుకొలిపి
భారతకుటుంబమున కాత్మ బలముఁజేర్చి
యేకజాతీయతా భావ మొలయఁజేసి

తోడి మతములలోన హిందూమతంబు
నఖిల జాతులలోపల నార్యజాతి
గౌరవంబును పత్కీర్తి పేరుఁగాంచి
యభ్యుదయ మొందఁజేయు నుద్యమముగాని
సకల కులములు గలిపెడు చర్యగాదు. 119

సీ. పంచమాదుల నుద్ధరించు ప్రయత్నంబె
జల్లి మాటలవల్ల జరుగఁబోదు!
ఉచితమై తగునట్టి యుత్తమ విద్యతోఁ
జర్మకారక పరిశ్రమము నేర్పి
తెలుఁగు సీమల నెల్లెడలఁ జర్మసామగ్రి
నిర్మించు శాలలు నిలుపవలయు!
నిలిపి చర్మపుఁ వస్తువులు సిద్ధపరిపించి
యన్యదేశ్య ప్రవాహ మాపవలయు!

తే. ఈవలయు! మాలలకు సౌఖ్య జీవనంబు;
నధికధనమూల మీకార్య మగుటకతన
నాంధ్ర సూర్యునివంటి యౌదార్య ధుర్యు
లీ మహోద్యమమున కూత మియ్యవలయు! 120

సీ. నుడువలేదు! సుమండి! కడజాతి వారింట
భోజనంబులు సేయఁ బోలు ననుచు
పలుకలేదు! సుమండి! పంచమ జాతితో
స్నేహంబు లేప్రొద్దు సేయుఁ డనుచు



చెప్పలేదు! సుమండి! చేరి మాలలతోడఁ
బొందుగా వియ్యంబు లందుఁ డనుచు
ఆడలేదు! సుమండి! యంత్య వర్ణజులను
విందు వేడ్కలకు రావింపుఁ డనుచు

తే. ఆర్యవరులార! సహభోజనాదికములు
సహజ సద్భావ సంపద సమనుగావు!
ఐకమత్యంబు సమకూర్చి యలరఁజేయ
సానుభూతినే యున్నంటి సరి సుమండి? 121

సీ. అన్ని జాతులకు విద్యాదానమును జేసి
జ్ఞాన సంపదఁ బెంపఁ బూనరయ్య!
ఎన్ని కులములున్న హిందువు లందఱు
నేక జాతి యటంచు నెంచుఁడయ్య!
నీచ వంశజు లెల్ల శౌచ, మారోగ్యంబుఁ
జెందు సాధనములు జేయరయ్య
ఆపన్నులై యున్న యంత్య జన్మలకైనఁ
దోడు పాటొనరింపఁ జూడరయ్య!

తే. ఆర్య లేగిన దారుల నరయరయ్య!
ఉన్నతాదర్శమున దృష్టి యుంచరయ్య!
మనసులో భేద భావముల్ మరువరయ్య!
హిందు జాతినిఁ బునరుద్ధరింపరయ్య! 122

ఉ. మాలలభావికాలదశ మాన్యతరంబు, మహోన్నతంబునై
కా్రిలెడు:నిందుసందియముఁగాంచగనక్కరలేదు, దైవమీ
లీలఁబరీక్షసేయుచుఁ జలింపక ఓర్చుచుఁదన్నుఁగొల్చు సం
శీలుర నుద్ధరించునని చెప్పవాకో! మన వేదశాస్త్రముల్.

గీ. మనము మాటను దక్కించుకొనక యున్నఁ
గార్యమాగదు, కాలమే గడవఁ జేయు
దేవుఁడే సాయమును జేయు దీన తతికిఁ
జేరి తోడ్పడరయ్య! దేశీయులార! 124





# ప్రార్థన.



ఉ. మాలల గోల భాగవతమా! మరి భారతమా! వినంగ; మా
కాలము వోవుటే ఫలము కాకిఁక పుణ్యము! పూరుషార్థమా
"మాలలటంచు బేర్కొనిన మాత్రనె పాపమువచ్చు," నంచు బ్రా
ల్మాలక, మీర లీబయిసి మాలిన దీనుల నాల కింపుడీ!



# నిరుద్ధభారతము.



సీ. సరస దయా సత్య శౌచ సంపదలొప్ప
నర్తించు భూసుర స్వాములార!
ఘనమైన దేశపాలనశీలమున మించి
పరగెడి క్షత్రియ ప్రభువులార!
భాగ్యభోగ్యంబు లొప్పఁగ దానకర్ణులై
తనరారు వైశ్యరత్నమ్ములార!
కాయకష్టమున దేశీయవృద్ధికి ధన
ద్రవ్యముల్ గూర్చు శూద్రవరులార!
గీ. దీనజనులము; మేము మీ దేశజులము;
ఆదివారము మీకు; మీ సోదరులము;
పతితులైనాము; కూడు దుర్గతిఁ దొలంచి,
జ్ఞానధనమిచ్చి మముఁ బ్రోవఁ బూనరయ్య!
సీ. రాజ్యాంగ తంత్రజ్ఞ రాజి మెచ్చఁగ ధరా
రాజ్య మేలిన మహారాజులకును
జ్ఞానప్రదాయక గ్రంథకోటినిఁ గూర్చి
సత్కీర్తి వడసిన సత్కవులకు
విజితేంద్రియత నొప్పి వీతరాగత మోక్ష
మార్గ దర్శకులైన మానులకును



సకల జీవన సౌఖ్య సాధనంబులు జూపు
లోకజ్ఞు లగునట్టి లౌకికులకుఁ
తే. దావలంబైన మావంశ మీవిధానఁ
గేవలంబైన దుస్థితిఁ గీడ్వడంగ
నావిలంబయ్యె మామధుః తేపవడకి
క్రేవలం జేర్చి, సత్కృపఁ బ్రోవరయ్య 2
సీ. కుక్కలకంటెఁ దక్కువవార మైతిమా!
మమ్ము మీ వాడల మసలనీరు
కాకులకంటెఁ జుల్కనివార మైతిమా!
మమ్ము మీదవ్వుల మసలనీరు
పిల్లులకంటెఁ బాపిష్ఠుల మైతిమా!
మమ్ము మీయిండ్లలో మసలనీరు
దున్నలకంటె నెంతో నీచ మైతిమా!
మమ్ము మీ వాకిండ్ల మసలనీరు
తే. తేళ్ళకంటెను గోళ్ళ పొట్టేళ్లకంటె
మీకుఁ గొరగాక పోతిమా! తాకనీరు
సుగుణమణులార! న్యాయంబుఁ జూడరయ్య!
మేము మీ సోదరులము మమ్మేమరయ్య! 3
సీ. ఇలువీడి పయనంబు లేగుదెంచెడి వేళ
నెదుర నేరికిఁ దారసిల్లరాదు

నాటకంబులు, సభలు, నవ్యవినోదముల్
వేడుకతోఁ జూడ వెళ్ళరాదు
సర్వవేళలనైన భక్తితో దేవతా
దర్శనంబును జేయఁ దలఁపరాదు
పదిమంది నడచెడు బాట గదా యంచు
నడు వీధిలోనైన నడువరాదు
ఆ. ఊరి వారితోడ నీరాటరేవుల
స్నాన మాడరాదు, జలముఁ గొనఁగ
రాదు మాటలాడరాదు శిష్టులతోడ;
మేము చేయు పాప మేమిటయ్య!
సీ. శుచిలేదనుచును మమ్ముఁ జూడరాదందురా
పరిశుభ్రతను మాకుఁ గఱపరాదె!
పరమమూర్ఖులు మీరు పనికిరారందురా
తెలివితేటలు మాకుఁ దెలుపరాదె!
సద్గుణంబుల మీరు సాటి రారందురా
సుహిత బుద్ధులు మాకు మప్పరాదె!
కరము నీచులు మీరు కలయరాదందురా
నేరతనంబును మాకు నేర్పరాదె!
తే. అతి దరిద్రులగుట రోతు మందురేని
సిరి గలుగు మార్గములు మాకుఁ జెప్పరాదె!



భూతదయ యుంచి, పటు సానుభూతి మించి
శ్రేయములు గూర్పరయ్య! దేశీయులార! 5
సీ. మము మీరు వెలివేసి మన్నింప కుంటచే
నూరి బైటను మేము చేరవలసె
పరిశుద్ధతను మాకుఁ గఱపకుండుటచేత
మాలిన్యమున మున్గి తేలవలసె
చదువు చెప్పక మమ్ము వదలివేయుటవల్ల
నజ్ఞాన కూపమున్ దడఁగవలసె
నీతు లేమియు మాకు నేర్పకుంటచేత
దుర్నీతిలోఁ బడి దొర్లవలసె
సీ. మన మతంబునఁ గల ధర్మమర్మములను
జెప్పనికతాన నన్యులఁ జేరవలసె
కలసి చేదోడు వాదోడుగా మెలంగు
మమ్మిటు లుపేక్షసేయ సేమమ్ము గలదె! 6
సీ. ముద్దివారవి కన్నబిడ్డల నెందేని
ప్రేమింపకుందురే వెర్రిలేని?
క్రూరచిత్తులటంచుఁ గొడుకులఁ దయమాని
పోషింపకుందురే మూర్ఖులేని?
అప్రయోజకులంచు నాత్మసంతానంబు
విడనాడఁజూతురే వెడఁగులేని?
జ్ఞానశూన్యులటంచు సూనులఁ బగఁబట్టి
తెగనాడఁజూతురే ముగుదలేని?

తే. ఎట్టిలోపంబు లెన్ని చూపట్టుచున్నఁ
దలఁపక సహించి పరమశాంతము వహించి
కన్నబిడ్డలవలె నెంచి కరుణ నెంచి
మమ్ము మన్నించి పెంచరే! మాన్యులార! 7

సీ. చదువు గల్గినఁగదా! సదసద్వివేకంబు
తోఁ జాకచక్యంబు తొంగలించు
ధనము గల్గినఁ గదా! ఘనతర వ్యవహార
కౌశల్య మహిమంబు గానుపించు
శిక్ష గల్గినఁ గదా! చిర సాంప్రదాయక
సద్వర్తన స్ఫూర్తి సంఘటిల్లు
సాము గల్గినఁగదా! శాత్రవోద్యద్దర్ప
నిర్వాపణ ఖ్యాతి నివ్వటిల్లు

తే. మాకు చదువీక, ధనమీక, మంచి శిక్ష,
సాముఁ, గరపక, పామరుల్, సోమరులని,
మందులని, పందలని మమ్ము నిందచేయ
నేమిఫల మున్నదయ్య! మాస్వాములార! 8

సీ. మారిషస్ దీవిలో మర్యాదచేయక
యలుసు చేసినయంత నల్పులైర
సౌతాఫ్రికాలోన సమముగాఁ జూడక
నిరసించినంతనే నీచులైరె?
కనడా ధరిత్రిలో గౌరవింపక యవ
మానించి నంతనే హీనులైరె?



అమెరికా సీమలో నాదరింపక చిన్న
చూపు చూచిన మాత్రఁ బాపులైరె?

తే. భారతీయులు; వారి కెవ్వారు సాటి?
నాగరకులందు భరత సంతాన మెట్లొ
భరతవర్షీయులందు శ్వపాకులట్లె
ద్వేషభావంబు మాని శోధింపరయ్య! 9

సీ. పురములలోనఁ గాపురము లుండఁగనీక
నడిదారిలోపల నడువనీక
పదిమందితోఁ బాటు బడులకుఁ బోనీక
పొగబండ్లలోఁ బొత్తు పొందనీక
కృషికార్యముల స్వయంకృషి యొనర్పఁగనీక
వాణిజ్య లాభముల్ వడయనీక
నీచులవలె నెంచి, నిర్దయత్వము మించి,
నానాగతుల నవమానపరచి

తే. మిమ్ము మమ్మును నొక్క చందమ్ముఁ జేసి
కష్టపెట్టిన సౌతాఫ్రికనుల నెల్ల
దుర్నయులటన్న మీరలే; వర్ణభేద
మూలమున, మమ్ము హింసింపఁబోలునయ్య! 10

సీ. పరమభక్తిని మీరు పఠియించు శ్రీరామ
నామమంత్రమునె యెన్నఁడుఁ బఠించి
హరియాజ్ఞగా మీరు ధరియించునట్టి చం
దమునె యెపుడు వస్త్రములు దాల్చి

గుణిమీర మీరు గైకొనునట్టి శ్రీమణీ
శ్రీచూర్ణములె ఫాలసీమఁ జేర్చి
అతిశయంబుగ మీర లాదరించెడునట్టి
నరణిసే కేశపాశములు దాల్చి
తే. మీరు హిందూమతంబునే మిగులనమ్మి
కొలిచి ముప్పదిముక్కోటి దైవతముల
సేవచేసెడు మమ్మిట్లు చేరకుండఁ
గొట్టుటిది ధర్మమే! ఆర్యకులజులార! 11

సీ. అగ్రవర్ణములవా రధికులంచుఁ దలంచి
యతివిధేయతఁ జూపి నన్నినాళ్ళు
బ్రాహ్మణు లందరుఁ బరమదైవములంచు
నతిభక్తితో మ్రొక్కి నన్నినాళ్ళు
బ్రాహ్మణ పాదతీర్థము పావనంబని
యతిమోదమునఁ ద్రాగినన్నినాళ్ళు
ద్విజు లెల్లరును గొల్చు దేవతాకోటిని
యతిహర్షమునఁ గొల్చి నన్నినాళ్ళు
గీ. దవ్వులకుఁ దోలి యన్యమతస్థులగుచు,
ద్విజుల, ద్విజదైవతంబుల ద్వేషబుద్ధి
గలిగి నిరసించునాఁడు, పుల్కసులనెల్ల
గారవించెద రిది యేమి గడుసుఁదనము? 12

సీ. దూరదూరంబుగాఁ దోలఁగు చుండెడు వాఁడు
సరసఁ గూర్చుండంగ శక్తుఁడగుచు



మడివేళ స్మరియింపఁ బడరానివాఁడు హ
స్త స్పర్శమున కర్హతను వహించు
అవశంబుచేనైన నంటఁ గూడనివాఁడు
కలసి వర్తింప యోగ్యతను గాంచు
దర్శనంబునకైన దగనట్టివాఁడు మి
త్రత్వంబునకు బాత్రతను దాల్చు
గీ. క్రైస్తవుండైన మాత్రఁ బుల్కసకులుండు
మన మతంబున కటువంటి మహిమ లేదె?
దురిత చరితులకెల్ల హిందూమతంబు
శరణ మిడ లేదనుట దుర్యశంబుగాదె! 13

సీ. కాపురంబులు చేయఁగాఁ జుట్టుగుడిసెలే
కాని లోగిళ్లు లెక్కకును లేవు
చెలఁగి కట్టంగ మాసిన చింపిగుడ్డలే
కాని వల్వలు కొంచెమైన లేవు
త్రావంగ నూకల జావయు, గంజియే
కాని యన్నమును శాకములు లేవు
సొగసుగాఁ దాల్చ గాజులుఁ, బూసపేరులే
కాని బంగరునగల్ లేశ లేవు
గీ. పంట పండింపఁగా నూరివారిచేల
కాని సొంతంబు లెందును గానరావు
అకట! మా ఘోర దారిద్ర్య మెవ్వరికైన
జాలి పుట్టింప దాయెనా? శ్రీలులార! 14

సీ. ఆకలి చిచ్చుచే నడలి చచ్చినఁగాని
మాలల కొక యన్నశాల లేదు
నోరెండుకొనిపోయి దోఁచుచున్నను గాని
మాలల కొక పానశాల లేదు
ఘోరరోగములచేఁ గూలుచున్నను గాని
మాలల కొక వైద్యశాల లేదు
అచ్చరాలను నేర్వ ముచ్చటైనను గాని
మాలల కొక పాఠశాల లేదు
గీ. దిక్కు మొక్కును లేక పఱిందినను గాని
మాలలకు నొక్క రక్షణశాల లేదు
దానవీరులు గల యీ యందుధాత్రియందు!
ధర్మహానియొ మాలకు ధర్మమిదుట! 15
సీ. మా మడ్డితనము మా మాలిన్యమును జూడ
దయ రాదటయ్య! సధర్మలార!
మా యవివేకత మా నీచతను జూడ
జాలి లేదాయెనా! నరనులార!
మా యిండ్లు వాకిండ్లు మా దరిద్రతఁ జూడ
హృదయంబు కరఁగదే! సదయులార!
మా వాలకంబులు మా దుస్థితిఁ జూడఁ
గన్నీరు గారదే! యన్నలార!



గీ. మమ్ము మన్నించి యుద్ధరింపఁగను మీకు
బుద్ధి పుట్టక పోయెనే! పుణ్యులార!
మేము మీ సోదరులమన్న మేలిమాట
చిత్తమునఁ దోఁచలేదె! దేశీయులార! 16
సీ. వాత్సల్యమున 'నాత్మవత్సర్వభూతాని,
యను పల్కు మనమునం దరయరయ్య!
అర్థిఁ 'బరోపకారార్థం శరీర, మ్మను
పలుకు మీ మదిలోన నిలుపరయ్య!
కరుణమైఁ 'బాపాయ పరపీడన, మ్మను
నీతి డెందమునఁ గణింపరయ్య!
సారిది 'సర్వే జనా స్సుఖినో భవం, తను
ధర్మంబు నెదలోనఁ దలఁపరయ్య!
తే. మాపయిని సర్వసమతను జూపరయ్య!
కూర్మితోయి మాకు మేలొనఁ గూర్పరయ్య!
మమ్ము బాములఁ బెట్టక మనుపరయ్య!
మాకు సౌఖ్యంబు సమకూర్చి సాకరయ్య 17
సీ. మోయకున్నదె! మోయునట్టులు మమ్ము
భూమాత మనుకు దీని భూమిదేవి
మీకు వెన్నెలఁ గాచి మాకుఁ గాయుట లేదె!
చలువల పరసీమ చందమామ
మీ మీఁదనే గాని మామీఁద వీవఁడే!
సరస సౌరభశాలి చల్లగాలి

వెలుఁగు వేఁడియు మీకుఁ గలిగించి మాకీడ!
భవ్య సౌఖ్యకరుండు భాస్కరుండు
తే. కురిసి మీపైని మాపైనిఁ గురియకున్నె?
సకల సస్యావన సుకీర్తి జలదమూర్తి
దైవదృష్టికిఁ బక్షపాతంబు లేదు!
సృష్టి నీక్షించి తెలియరే! శిష్టులార! 18

సీ. మీకుఁ బంటపొలాల మా కరణ్యములందు
నాహారవస్తువు లమరు నొక్కొ?
ఫలవృక్షములు పచ్చఫలములు మీకిచ్చి
చేదుపండ్లను మాకుఁ జేర్చునొక్కొ?
నదులు శుద్ధంబైన యుదకంబు మీకిచ్చి
కసటు జలంబు మా కొసఁగు నొక్కొ?
మీకుఁ దియ్యనిపాలు మేకొల్పు గోవులు
వట్టినీళ్ళను మాకు వదలునొక్కొ?
తే. వహ్ని మీకాని పాకముల్ పచనపరచి
మాకుఁ బచనంబు సేయక మానునొక్కొ?
సృష్టిలో లేసి వలపక్ష మేల మీకు?
శిష్టజనులార! వేగ వర్జింపరయ్య! 19

సీ. మామీఁద సోఁకి మీమైమీఁద సోకదే!
గాలి కింసుకయేని మైలగలదె!
మేము నిల్చినచోట మీరు నిల్చుటలేదె!
భూమి కొక్కింతేని ముట్టుగలదె!



మేము చేకొనువెన్క మీరు చేకొనలేదె?
యానీటికింతేని రంటు గలదె!
మేము ముట్టినదాని మీరు ముట్టుటలేదె!
యగ్గి కింసుకయేని నెగ్గుగలదె!
తే. వాడరే! మేమువాడిన భాష మీరు
తాకరే! మేము తాకిన ధనము మీరు
విశదముగఁ జూడ వానికి నశుచి గలదె!
మాకువెలియెట్లు వచ్చెనో మాన్యులార! 20

సీ. మీ తల్లిదండ్రులు మిమ్ముఁ గాంచినరీతి
మాతల్లిదండ్రులు మమ్ముఁ గనరె!
మీ మేనులందు మామేనులవలె రక్త
పలలంబులే గాక పాలుగలవె!
కష్టసుఖాలు మీకాయంబులకె గాని
మాకాయములకేమి లేకయున్నె!
సర్వేంద్రియంబులు సరసమంబులుగాక
హెచ్చుగా బ్రహ్మ మీకిచ్చెవాడె!
ఆ. ఒక్కటే కులంబు, నొక్కటే కుటుంబము,
నొక్కఁడె దేవుఁ డాత్మ యొక్కటె పుణ్య
మొక్కటె పాప మొక్కటె యొక్కటె పుట్టువుమృత్యు
వొక్కటె తెలియుఁ డెల్లరికిని ద్విజులు 21

సీ. పాఠశాలల మాల బాలకు లిరువంక
గదియుంగఁ గూర్చుండి చదువవచ్చు

రైలులో, సంతలో, రహదారి పడవలో
మాలలఁ గలసి దిమ్మరఁగవచ్చు
ఆసుపత్రులలోన, సంగళ్లలోన మా
తంగుల తీర్థంబు త్రాఁగవచ్చు
క్రైస్తవ మతములోఁ గలసిన మాలఁ డు
ద్యోగిస్థుఁ రాగానె మ్రొక్కఁగవచ్చు
తే. పంచములు తెచ్చి యిచ్చిన ఫలములైన
బ్రాహ్మణోత్తములెల్ల సాపడఁగవచ్చు
నీశ్వరునికైన నైవేద్య మిడఁగవచ్చు
మాలలకు నిట్టివేళల మైలలేదె? 22
సీ. కలుగరే మాలో నఖండశౌర్యాఢ్యులై
రాజ్యంబులేలిన రాచవారు
పుట్టరే మాలోన బుద్ధిసంపన్నులై
విద్యావిలాసంబు వెలయువారు
లేరె మాలో యోగలీలా వినోదులై
ఘన తపోమహిమచేఁ గ్రాలువారు
నెగడరే మాలోన నీతివిస్ఫీతులై
శీల కలితఁ బ్రకాశించువారు
తే. ఉదయ మొందరె మాలోఁ బరోపకార
మానితవ్రతమున ధన్యులైనవారు
తక్కుఁగల వర్ణములకన్నఁ దక్కువనఁగ
లోపమేమైన మాయందుఁ జూపఁగలరె? 23



సీ. ప్రోలు మాలక పాటు పడెడు వార మనంగ
విస్తరించిన సేద్యవృత్తి సాక్షి!
ఘనన పరిశ్రమలందు గడిదేరితి మనంగ
మాలనూలను మేలికూట సాక్షి!
బహుళ విద్యామర్మ పారీణుల మనంగ
ననవద్య హృద్య వాద్యములు సాక్షి!
విశ్వాసబుద్ధిచే వెలయువార మనంగఁ
జిరసమాగత రాజసేన సాక్షి!
తే. నీతిచే వన్నెకెక్కిన జాతియనఁగ
మాయ మర్మంబు లెరుఁగని మనసు సాక్షి!
తక్కుఁగల వర్ణములకన్నఁ దక్కువనుచుఁ
దీసివేసిన పని యేమొ? తెలుపరయ్య! 24
సీ. చెమటోడ్చి సేద్యంబు చేయువారము మేము
పంటలెల్ల భుజించువారు మీరు
పశువులనెల్లఁ గాపాడు వారము మేము
పాలు పెరుఁగుఁ ద్రాగువారు మీరు
పెద్దతోటలు వేసి పెంచువారము మేము
పండ్లారగించెడివారు మీరు
ముచ్చుజోడు లమర్చి తెచ్చువారము మేము
వానివల్ల సుఖించు వారు మీరు

ఆ. ప్రతిదినంబుఁ గష్టపడెడు వారము మేము
ఫలము లనుభవించువారు మీరు
వాడఁదలఁచినారె! పనిముట్టువలె మమ్ము,
మనుజులనెడు మాట మరచినారె! 25

సీ. పాలేర్ల కియ్యంగ వలసినధాన్యంబు
పిచ్చకుంచాలతో నిచ్చువారు
పాలేర్లు తీర్చెడు బదులు ధాన్యముఁగొల్వఁ
బెచ్చుకుంచము లెంచి తెచ్చువారు
బదులిచ్చినట్టి యేఁబది కుంచముల కొక్క
పదిఁ జేర్చి పద్దులు వ్రాయువారు
అక్కరకైకొంత యప్పిచ్చి తక్కువ
కూలి కెప్పుడు పనుల్ గొనెడువారు
తే. మాలలకు సరిహద్దులో మాన్యమున్న
గదుముకొని తమ పొలములోఁ గలుపువారు
నగుచు నేడ్పింతురే! యిట్లు లక్కటకట!
రయితులార దయారస రహితులార. 26

సీ. పాలిచ్చినన్నాళ్లు పాలించి యావుల
ముసలివంచును ద్రోసి పుచ్చినట్లు
సవారికై యుపయోగపడు గుర్రములఁ బెంచి
పెద్దవానిని విడ్చి పెట్టినట్లు



దుక్కికక్కరకైన దున్నలఁ బోషించి
వృద్ధత్వదశయందు విడచినట్లు
బరువు మోసిననాళ్ళు బ్రతికించి యేన్గుల
వగ్గుతనంబున వదలినట్లు
తే. పడుచుఁదనమున మావల్లఁ బనులు గొనుచు
నకట మా యౌవనంబెల్ల నపహరించి
బల ముడిగినంతనే మమ్ముఁ దలఁప రహహ.
రయితులార, దయారస రహితులార. 27

సీ. చనుమానమునఁ జేరి చనుఁబాలు తెగఁద్రాగి
క్రుద్ధత్వమున రొమ్ము గ్రుద్దినట్లు
కొల్లఁగా నున్నపాలెల్లఁ బిండుక క్రోలి .
కోపించి పొదుగును గోసినట్లు
ఫలములెల్లను దుల్చి యెలమిమై భక్షించి
క్రూరత్వమునఁ జెట్టుఁ గూల్చినట్లు
అక్కరయెండాక నండాక నిల్చి య
క్కరఁదీరి సత్రంబుఁ గాల్చినట్లు
తే. కావలసినన్ని పనులెల్ల మావలననె
యిచ్చకంబులు పలికి చేయించుకొనుచుఁ
గడకు మే ముందుకును కొరఁగామటంచు
గాసి యిడుట కృతఘ్నత గాదటయ్య. 28

సీ. ఒజ్జయే శిష్యు మేలోర్వఁ జాలనియట్లు
కంచెయే చేనుమేయఁ గడఁగినట్లు
హారమే సర్పమై ప్రాణముల్ గొనినట్లు
గొల్లఁడే గొఱ్ఱెలఁ గోసినట్లు
తల్లియే పిల్లపై దయను దప్పినయట్లు
శరదమే నిప్పులు గురిసినట్లు
ఇష్టదైవమె యష్టకష్టంబు లిడినట్లు
మిత్త్రుడే మిత్తియై మ్రింగినట్లు
గీ. తల్లిదండ్రు లన్నదమ్ములుఁ దాతలు
దైవ మీరేయనుచుఁ దలఁచి నమ్మి
భయము భక్తి గలిగి పగలు రేలును మీకు
సేవచేయు మమ్ముఁ జెరుపఁ దగునె? 29

సీ. జీవహింసయె నిత్యజీవనంబుగనున్న
కటికివారల నైన గౌరవింత్రు
పడుచ దనంబె యప్పుడు వృత్తిగాఁ గల్గు
గడనకత్తెల నైన గౌరవింత్రు
లంచఁపుగడ్డి కొల్లంగ మేయుదుష్టాధి
కారిపశుల నైన గౌరవింత్రు
కల్లలే కూడుగాఁ గలిగి వర్తించెడు
చిడుము గొడ్డల నైన గౌరవింత్రు



ఆ. మంచివృత్తి గలిగి మానంబు విడువక
నీతిగలిగి సత్యనిరతి గలిగి
మెలఁగు మమ్ము నిట్లు వెలివేసి చూచుటఁ
జేసి గాసిపెట్టఁ జెల్లునయ్య! 30

సీ. మేనెల్లఁ గడునల్లనైనంత మాత్రాన
మనుజస్వభావంబు మారునొక్కొ?
మలినవేషముఁ దాల్చి మసలుచుండిన మాత్ర
స్వేచ్ఛాభిరతియే నశించునొక్కొ?
దారిద్ర్యదుఃఖార్త దశనున్న మాత్రాన
నాశాంకురములెల్ల నణఁగునొక్కొ?
కొనలేని దైన్యంబు ననుభవించెడు మాత్రఁ
బౌరుషశక్తి చల్లారునొక్కొ?
తే. జ్ఞాననేత్రంబు లేనిమాత్రాన సౌఖ్య
జీవనాపేక్ష చిత్తానఁ జేరదొక్కొ?
అకట మా స్వామ్యములనెల్ల నపహరించి
హింసఁ బెట్టెద రిట్లు సహింతుమయ్య 31

సీ. చలిచీమ కొక్కుడఁ జచ్చిపోవునో యంచు
నడుగులు మెల్లఁగా నిడెడివారు
తీగసాగిన పూవుఁ ద్రెంపఁ జేయాడక
కనులార? గని తృప్తిఁ గనెడువారు

మిగుల ముగ్గియు నేలమీఁద రాలక చెట్టు
నున్న పండ్లను గోయనోడువారు
మోయఁజాలక నొచ్చునో యన్న భయమున
వాహనా లెక్కక వదలువారు
తే. దుష్టజంతుల నైనఁ శత్రువులనైనఁ
బట్టి వధియింపఁగాఁ గొంకు వడెడువారు
సాధుహిందువు లట్టినైజమును విడిచి
తోడినరులను హింసింప గూడునయ్య?
సీ. వర్ణముల్ మను వెన్ని వ్రాసెనో యొకమారు
ధర్మశాస్త్రంబును దడవరయ్య
మనపురాణంబు లేమనుచు బోధించునో
శ్రమనెంచ కొకసారి చదువరయ్య
గీతలోఁ గృష్ణుఁ డేరీతిగాఁ జెప్పెనో
వేఁడెద నొకమాటు చూడరయ్య
పూర్వచారిత్రల పోకడ లెట్లుండునో
వినువక రొకతూరి వెదకరయ్య
తే. ఎట్లు పంచమకులంబు పుట్టినదియొ
తప్పక యోఁజింగినది యెల్లఁ జెప్పరయ్య
మీరావలన నేర్పడిన జాతి మీరె రోసి
వాఱిఁ బోలిన నది యెట్లు బ్రతుకునయ్య! ౩౮



సీ. మాకు వైష్ణవమిచ్చి మమ్ముద్ధరింపఁడే!
మాననీయుండు రామానుజుండు
మతధర్మములు దెల్పి మమ్మాదరింపఁడే
శ్రీదయానందుండు చిరయశుండు
తన మతంబునఁ జేర్చుకొని గౌరవింపఁడే!
నానకు శుద్ధ విజ్ఞానమూర్తి
స్వమతంబు విడకుండ సమత మన్నింపఁడే
యల వివేకానందుఁ డలఘు గుణుఁడు
తే. ధన్యులను జేయలేదె! చైతన్యులాది
యైన మతకర్త లేకనాథాది భక్తు
లకట! మీరిట్లు విడనాడి యనయులగుచుఁ
జిన్నఁబుచ్చెద రిది యేమి శీలమయ్య? ౩౯
సీ. కవికోకిలము తాత్త్వికవివేకి వాల్మీకి
యేవర్ణమున నుదయించినాఁడు?
మౌనిమండల పితామహుఁడౌ పరాశరుం
డేకులంబున జన్మమెత్తినాఁడు?
ధర్మసంవేది వేదవ్యాస మునిచంద్రుఁ
డేవంశమందు జన్మించినాఁడు?
ధన్యుఁ డధ్యాత్మ విత్తముఁడు మాన్యుఁడు శుకుం
డేగోత్రమున నుద్భవించినాఁడు?
తే. సత్యవతి జనియించిన జాతియేది?
రోహిదాసుండు పుట్టిన గేహమేది?

వారలెల్లరుఁ బూజ్యులై వరల లేదె?
కులము లేదని మహిమంబు కొలఁదినదెనె? 35

సీ. అభిమాన పుత్రికలని మాకులస్త్రీల
గాధిరాజ సుతుండె గారవించె
తన సభాస్థాన మందునఁ బ్రవేశం బిచ్చి
యా హరిశ్చంద్రుఁడే యాదరించె
ఘనుఁడు మారోపంతుఁ డను మహాభక్తుడే
మాజాతి కల్లుఁడై మైత్రిఁ గూర్చె
పుడమి వేల్పులకంటె ముందు విందొనరించి
యల యేకనాథుఁడే యశముఁ బెంచె

తే. వారు మావంటి మాలలు గారఁటయ్య!
వారు మీవంటి సత్కులుల్ గారఁటయ్య!
మమ్ము వెలివేసి తీర్థయ ధర్మమన్నఁటయ్య!
చిన్నఁబుచ్చక పదముఁ జెంతఁ జేర్పరయ్య! 36

సీ. అలఘు శాపానుగ్రహాసమర్థుఁ డగు మతం
గమహర్షి మావంశకర్త గాఁడె!
ఘనతర జ్ఞానియా కపిల మునీంద్రుండు
మాకొలమ్మునఁ గన్నాఁడు గాఁడె!
నందవరమ్ము నందముగ నేలిన వీర
నందుండు మాకు నందనుఁడు గాఁడె
వైష్ణవాచారము లవారిగాఁ ద్రొక్కు తిరు
ప్పాణియాళ్వారు మావాఁడు గాఁడె!



తే. కవికుల విభూషణంబన ఖ్యాతిఁ గన్న
కనక విబుధుండు మాకులాగ్రణియె గాఁడె!
మందులముఁ బందలము గాము మంచివిద్య
నేర్చి యున్నత పదవులఁ నిలుపరయ్య 37

సీ. వక్కాటిసీమలోఁ బ్రబలయోధుండైన
కన్నమనీఁడు మాయన్న గాఁడె?
శ్రీహస్తినాస్థాన సత్కవి దివా
కరుఁడు మాకూర్మి సోదరుఁడు గాఁడె?
యామునాచార్యుల శిష్యుడై యొప్పు మారనూ
ర్నంబి మాకుల భూషణంబు గాఁడె?
భక్తరత్నంబుగా భాసిల్లు నలచోక
మేళుండు మా భాగ్యమాళి గాఁడె?

తే. రానుత కురంగి కోడలై వాసిఁ గనదె?
యల త్రిశంకుండు చుట్టమై యలరలేదె?
పూజనీయుల కెల్లను భాజనంబు
మాజనం బిది తెలియదే భూజనంబు? 38

సీ. జగదేక పూజ్యురాలగు నరుంధతి సాధ్వి
భావింప మా యాఁడపడుచు గాదె
ఇనకులోత్తమ పురోహితుఁడు నమ్మిన వసి
ష్ఠుండు మాయింటి యల్లుండు గాఁడె
సత్యసంధుఁడు హరిశ్చంద్రుఁ డాదిని సార్వ
భౌముండు మా పెద్దబంటు గాఁడె

దొడ్డ మహారాజబిడ్డ మాయావతి
మాయింటి కోడలై మలయలేదె
గీ. పాండురాజ కుటుంబిని పరమపూజ్య
వృత్త గొంతెమ్మ మాకిలువేల్పుగాదె
ఎన్నొ సంబంధములు మన కున్న విట్లు
లన్యులము కాము సుమ్మండి ఆర్యులార! 39

సీ. బ్రాహ్మణుండు, గురుండు, బ్రహ్మర్షి వరుఁడు నై
తనరు నుతోపి మా తాతగాఁడె?
వరగుణోత్తరుఁడా యనంతి వర్ధనుఁడు రా
కొమరుండు మా పెండ్లికొడుకు గాడె?
అల భృగు బ్రహ్మ వంశావతంసంబైన
పరశురాముండు మా భ్రాతగాఁడె
తపసిరాయలలోన విపుల కీర్తి నిఁగన్న
జమదగ్ని మాపిత్రు సముఁడుగాఁడె
* తే. రేణుకాదేవి మాకు మాతృమణిగాదె?
నాయు జేవుండు బంధురత్నంబు గాదె?
ఎండ రెందరు మావంశమందుఁ బుట్టి
పూతచరితులు గాలేదు పూర్వమందు? 40

సీ. శ్రీమత్పెరుంబదూర్ రామానుజస్వామి
తేరు లాగుదురు మావారు గాదె
సంక్రాంతి మూఁడు వాసరములు మేల్కోట
స్వామి సేవింత్రు మావారు గాదె

* మంత్రరత్నాకరము, క్రీడాభిరామము



హైందవప్రజ లంద రారాధనలు సేయు
మాతంగకన్య మానాతి గాదె
ఆదిశంకరులకు నధ్యాత్మవిద్యఁ బ్రి
సాదించె మాజాతి జనుఁడుగాదె
గీ. పంఢరీపురమున విష్ణుభక్తులెల్ల
రహిఁ బూజించు దేథులు మహారులనెడు
మహిమగల విగ్రహంబులు మావిగావె
ఆర్హ్యలము కామె సత్కృతి: కార్యులార 41

సీ. పంచదారలుఁ బాలుఁ బండ్లు వెట్టుచు ముద్దు
చిలుక లాలించు రాచిలుక మీఁద
రమణీయగతి గూఁడు లమరించి గారాము
గులుకఁ బెంచెడు లేడి గున్నమీఁద
పసిఁడి పంజరములోపలఁ బెట్టి చెలికార
మొఁకించు నెమలి తేమొలకమీఁద
తులకించు మచ్చికల్ తొలికించి పలికించి
కులికించు గోర్వంక కిలుకమీఁద
తే. కలికి వలకారి పావురా పులుఁగుమీఁద
మురిపెములు గొల్పు కోయిల కోఁదమీఁద
చిలుకరించు దయారస శీకరములు
చలము విడనాడి మానిరీఁదఁ జల్లరయ్య! 42

సీ. అడుగ లేదుగదయ్యా! కడిమిమై మీతోడి
స్నేహప్రధానోప గూహనములు
కోరలేదుగదయ్యా! కూర్మిమై మీతోడి
సంబంధ బాంధ వాడంబరములు
వేఁడ లేదు గదయ్యా! వేడ్కమై భోజన
ప్రతిభోజనాది సంభావనములు
ప్రార్థింప లేదయ్యా! బల్మిమై నన్యోన్య
గేహప్రవేశ కోత్సాహవిధులు
తే. పరమతంబులఁ గలసిన పంచములకు
మావలెనె నీచకులులైన మానవులకు
నెట్టి గౌరవమిచ్చి ప్రేమించుచుండు
రట్లు ప్రేమింపరయ్యా! మ మ్మార్యులార! 43

సీ. పల్లెకూటములకు బాహాటముగవచ్చి
చదువుకోనిచ్చినఁ జాలుమాకు!
అన్నివీధులయందు నడ్డంబు లేకుండఁ
జరియింపనిచ్చినఁ జాలుమాకు!
నీళ్ళ రేవులలోన నిస్సంశయంబుగా
జలము జేకొననిండు! చాలుమాకు!
తోడి నీచకులాలతోఁ బాటుగామమ్ము
నభలకు రానిండు! చాలుమాకు!



తే. గౌరవముఁగోరి యిస్లాము క్రైస్తవాది
పరమతంబులఁ జేరిన పంచమాది
నరుల మన్నించునట్లు మమ్మరయుచున్నఁ
జాలు! నయ్యదియే పదివేలుమాకు! 45

సీ. శరణాలయంబులు కరుణాలవాలులై
నెలకొల్పి దీనుల నిలుపరయ్యా!
పాఠశాలలు కృపాపరులై ప్రతిష్ఠించి
దివ్యవిద్యాశక్తిఁ దెలుపరయ్యా!
వైద్యశాలలు దయావంతులై స్థాపించి
యాపన్నులకు దారిఁ జూపరయ్యా!
కర్మాలయము లనుగ్రహముతో నిర్మించి.
నిఖిల వృత్తులు మాకు నేర్పరయ్యా!
తే. స్వమత ధర్మంబులను ధర్మశాలు లగుచు
మాకు వివరింపగదరయ్యా! మాస్వధర్మ
సరణి ననుకంప పెంపార సరిగనేర్పు
రించి, బోధించి, మమ్ముద్ధరింపరయ్యా! 56

సీ. పంచముల్ చదువుకోపలఁ బ్రవేశింపదినఁ
బ్రాలేర్వు దొరకు టబద్ధమనుచు
శ్వపచులు శుచిగల్గి సంచరించవ్వ రేని
ప్రాకి వృత్తికి గల్గు భంగమనుచు

గోసంగు లెల్లరు గొప్పవారైనచోఁ
జన్మకారకవృత్తి జరుగదనుచు
మాదిగల్ ధనికులై మన్నింపఁబడుచున్న
వెట్టి చాకిరిమాట చట్టిదనుచు
తే. స్వార్థపరు లాడుదానికి జడియవలదు!
వృత్తులు నశించు ననుమాట ఉత్తమాట!
గొప్పకొలఁదుల వారుందు రెప్పటికిని
నాగరక సీమలె నిదర్శనములు మనకు. 47

సీ. బాల్యవివాహముల్ బహ్వనర్థములకు
హేతువులగుట మీ రెఱుఁగరొక్కొ?
విధవావివాహముల్ విహిత కృత్యములంచు
నాత్మసాక్షిగ మీర లరయరొక్కొ?
నావికాయానం బనంతలాభప్రదం
బేయంచు మీర లూహింపరొక్కొ?
జాతిభేదములు దేశమును వర్ధిలనీక
నిలువరించు నటంచుఁ దెలియరొక్కొ?
తే. చేయుచున్నారు; చేతురు; చేయఁగారు;
తీసివేయరు; కటకటా! తెలిసి తెలిసి;
అంతరాత్మకు వ్యతిరేక మాచరింతురు;
దళిత ధృతులార! ఆచార దాసులార! 48



సీ. ఆత్మరక్షణపరాయణు లుద్భవించిన
భరతవర్షమ యిది! భక్తవరద
శరణాగతత్రాణ బిరుదాంకులను గన్న
హిందుదేశమ యిది హృదయనాథ
కరుణాసుధారస వరుణాలయులు నున్న
యార్యభూమియె యిది యాదిదేవ
లోకోపకారశీలురు జన్మమెత్తిన
పుణ్యఖండమ యిది పూతచరిత
తే. ఆత్మవిదులైన మునిచంద్రు లవతరించి
సత్క్షేత్రమా యిది యోమహానుభావ
మాయెనర్చిన పాపకర్మములవలన
నిట్టులయ్యెను నేఁడు? యోగీంద్రగేయ 49

సీ. మన వేదశాస్త్రంబులను జెప్పఁబడినట్టు
లీశ్వరుం డొక్కఁ డుండేని గలఁడ
కలఁడేని మాదు మొఱ్ఱల నాలకింపఁడే
యాలించి మాయందు జాలిపడఁడె
పడి వేగముగఁ రాఁడె వచ్చి మాదుస్థితిఁ
గనులారఁ గాంచఁడే కాంచి మమ్ముఁ
గావనెంచఁడె యెంచి కష్టంబులెల్లను
నెడఁబాపఁడే పాపి యీడులేని

ఆ. యమితకరుణతోడ నాదరింపఁడె యాద
రించి జ్ఞానధనము లిడఁడె యిచ్చి
పరమహర్షమునను వాలలాడింపఁడే
దీనబంధుఁడగుచుఁ దేజరిలఁడె 49

సీ. పట్టింపగదవయ్య! బుద్ధి ప్రసిద్ధిచే
విలసిల్లువారి మా కులమునందు
నిర్మింపఁ గదవయ్య! నీతి విఖ్యాతిచే
సరి మించు వారి మాజాతియందు
గలిగింపగదవయ్య! ఘన గుణ గణముచే
వర్ధిల్లు వారి మా వంశమందు
పొడమింపఁ గదవయ్య! భోగ్యభాగ్యములచేఁ
గొమరొందు వారి మా గోత్రమందు

తే. ఆర్త సంత్రాణ చణకీర్తి నందుమయ్య!
సర్వసముఁడన్న మాటను జాటుమయ్య!
దీన రక్షణ బిరుదంబుఁ దెలుపుమయ్య!
ఓదయామయ! మహనీయ! యోగిగేయ! 50



Printed at the jagapathi Printing works, Rajahmundry.

# అనుబంధము.

ఉ. గంగ పవిత్రమైనదనిగా! హరి హిందువులెల్లఁ దీర్థమే
గంగను గంగలోన మునుగంగను గంగనుబూజచేసి మ్రొ
క్కంగను వేడుకం గనుట, గంగకుగల్గదు భేదబుద్ధి మా
తంగులనైన గాననదు ధన్యులచేయునుగాని యట్టియా
గంగను మానుమంగను జగజ్జనజన్మ తరంగభంగనే
భంగిని మాలమాదిగలుపట్టి యపావనముల్ బొనర్తురీ
సంగతినింపు కేనియు విచారణసేయక నీళ్ళు రేవు మా
తంగులు చేరరాదనుచు దర్జనభర్జనచేసి యిట్లు మ
మ్మంగదపాలుచేసి వగనందగ గుందగజేతురో సుధీ
పుంగవులార ధర్మమనబోలునొ పోలదొ చూడరారె మా
కుంగతిగారె మా వెతలు గొబ్బునఁ దీర్చి సుఖంబుగూర్చరే

సీ. త్రాగుబోతులటంచు దప్పించబోదురా
మద్యపాయులికెంత మంది లేరు
గొడ్డుమాంసముదినే మడ్డివారందురా
మాంసభక్షకులెంత మంది లేరు
నీమంబులెరుగని నీచులందురా
మావంటివారెంత మంది లేరు
నిత్యసేవకులంచు నిరసింతురందురా
మందభాగ్యులికెంత మంది లేరు

ఉచితరీతిని భాషించు నొప్పిదంబు
లేసి వారనిమన్నింప లేసి యింతగ
మనుజులందట్టి వారెంత మంచివారొ
మమ్ము జుల్కనజేయు మూలమ్ముగలదె.
మాకుమీరు మతంబు మప్పజెడినను మీ
మతమె మామతమంచు మదినిదలచి
వెలివేసి మీరెంత వెలువరించుచునున్న
నశ్రాంతమును మిమ్మె యనుసరించి
అదయులై మమ్మెంత యణగద్రొక్కుచునున్న
నుద్ధరించెదరంచు బుద్ధినమ్మి
చదువీకదుస్సహాజ్ఞానాంధులందు ద్రో
సినను మాగురులంచు సేవచేసి
మే.. మిము వీడకున్నాము మేకలట్లు
కటికితనమున మమ్మిట్లు గాసిబెట్ట
దగవుగాదింక మాకు విద్యలనొసంగి
దయనొసంగర బ్రోవరే దాతలార.
సీ. పొగబండ్ల నోడల బోవుచో నొకరీతి
పడవల నెక్కునప్పు డొకరీతి
నడిదారిలోపల నడుచుచో నొకరీతి
యొగిదీర్ఘ యాత్రలం దొక్కరీతి



సంతలకేగెంచు సమయాలనొకరీతి
యొనరబట్టణములం దొక్కరీతి
పల్లెటూళ్ళందున్న పట్టులందొకరీతి
యగ్రహారముల వేరైనరీతి
లౌకికోద్యోగ వశులైన లాతిరీతి
యిట్టియాచారమింక నెందేనిగలదె
యెక్కరనుబట్టి నీమమా యక్కటకట
చాలుచాదస్తమిది ద్విజస్వాములార.
సీ. పరమహర్షముతోడ భక్షించుచున్నారు
గదకాస్మపాలిటన్ క్లబ్బులందు
బుద్ధిపూర్వకముగా భుజియించుచున్నవా
రుగద రిఫ్రెష్మెంటు రూములందు
ఆనందభరితులై యారగించుచునుంటి
రిగదసోషల్ గేదరింగులందు
మేలిమాలిమితోడ మెసవుచుంటిరిగదా
చాలగార్డెన్ పారిటీలయందు
స్నేహభావంబు వెలయ నాత్మానమొలయ
మెక్కుచున్నారు గాదొ పిక్కెనిక్కులందు
సకలజాతులవారు సంతయముదక్కి
కులములవు డెందుబోవునో తెలుపరయ్య
సీ. కపిలుడే మునిమున్నె యుపదేశమును జేసె
బుద్ధదేవుండేమి బోధచేసె

శంకరాచార్యుఁడే చందానఘోషించె
రామానుజాచార్యు డేమిచెప్పె
రామమోహనరాయ లేమాదిరివచించె
చైతన్యుడేరీతి చాటిచెప్పె
రామకృష్ణస్వామి యేమివక్కాణించె
స్వామివివేకుడే సరణిదెల్పె
గీ॥ అలదయానంద రామతీర్థాది ఘనుల
దివ్యసందేశములవేమి తెలుపరయ్య
దురభిమాన పిశాచంబు ద్రోలరయ్య
మాయెడ ససహ్యభావంబు మానరయ్య:

సనాతనాంధ్రులు

గీ. చదువునేర్చినారు జ్ఞానంబుగన్నారు
నాగరికతలోన పైగలట్టి
కులమువారితోడ దులదూగచున్నారు
ఆంధ్రభువిసనాత నాంధ్రజనులు.
క. సోదరభావము మెరయగ
సాదరముగ జూడకున్న
సత్యాగ్రహముల్ ప్రాదుర్భవించువైకం
బేదృష్టాంతంబు తెలియ కేద్విజులార
క. పాకమదియంత దూరము
లేకుండగ సర్వసమత రహిమీరంగా



ప్రకటజన్మపుహక్కుని
వేకముతో నొసగికీర్తి వెలయుండాంధ్రిల
ఆ. అంటరానితనము గెంటివేసితిమంచు
అగ్రజులు సనాత నాంధ్రనరుల
కౌగలించితిరుగ గాగోరెవరును
వారివియ్యమొంద గోరరెవరు.
ఆ. క్రైస్తవులనుజూచు మోస్తరుగా మున
ల్మానుజనుల జూచుమాదిరిగను
గౌరవంబుగ దురగనదు హిందుసనాత
నాంధ్రనరులగూడ నాంధ్రులార
ఆ ఎల్లవీథులందు స్వేచ్ఛగాతిరుగాడ
నిండుచదువనిండు ఎల్లయెడల
నీళ్ళరేవులందు నీళ్ళుచేకొననిండు
న్యాయమైనయివి సనాతనులకు
సీ. ఏపుట్టగనుగొన్న నాపుట్టనాగేంద్రు
నిరవుగాభావించు సరసులార!
ఏచెట్టుగనుగొన్న నాచెట్టుభగవంతు
నెలవుగానెంచు ధీలలితులార
ఏగట్టుగనుగొన్న నాగట్టుపరమేశు
నిల్లుగాదలచు సుధీంద్రులార

ఏమిట్లగనుగొన్న నామిట్లజగదీశు
నవతారముగ జూచు నవఘులార

గీ. మృగములఖగంబులను సరీసృపములందు
చెట్లులను పుట్టలందును మిట్టలందు
నీశ్వరుని లీలలనుగాంచి యొసగుమీరు
నరులహింసింతు రిదియేమి న్యాయమయ్య.

సీ. కోతిని గనుగొన్న ప్రీతితో హనుమంతు
నంశగాదంచు పుణ్యాత్ములార
వృషభంబుగని వెంకటేశ్వరుండనుచు నం
దీశ్వరుండని మ్రొక్కు నీద్యులార
కుక్క భైరవుడంచు గురుతర భక్తితో
భావించు కారుణ్య భావులార
గ్రద్దను గనుగొన్న గరిమతో విష్ణువాహన
ముగానెంచు ధర్మాత్ములార

గీ. ఎలుకజూచి పాము దీకించి
విఘ్నేశు వాహనంబు విష్ణుహారమనుచు
బాధచేయలేని సాధుశీలురు మీకు
సాటినరుల మీద జాలము తగునె

మాలాపంచరత్నంబు

ఎండవానలందు హిమమందు నిరులందు
పగలు రాత్రియనక పాటుపడుచు



ప్రజకు సుఖముగూర్చు పరమోపకారియా
మాలశివుని యట్టి మాలగాదె
తాను చెమటలోడ్చి ధాన్యాలు పండించి
గాదులందు జేర్చి కాపులిచ్చు
కూడుచాలనట్టి కూలికే హర్షించు
మాలదివ్య కుసుమ మాలగాడె
అధిక బలముగలిగి యడకువ చేమించి
పేదయయ్యు దొంగవృత్తి లేక
మాయలేక న్యాయమార్గాన వర్తించు
మాలవిష్ణు తులసి మాలగాడె
గుడిశలందు నుండి కుక్కిమంచములందు
పండి దుంపతూడు వండి తినుచు
చింపిగుడ్డ కట్టి చిత్తాన రంజిల్లు
మాలహేమ పుష్ప మాలగాడె
ఘనతవచ్చు పనులు ధనమిచ్చుపనులును
మీదువర్ణములకు నీదుగట్టి
జీవితంబు నిత్య సేవకై యర్పించు
మాల సుగుణరత్న మాలగాడె.



## ఉత్తమ గ్రంథరత్నములు.

1 స్వామిదయానంద సరస్వతి జీవితము. వెల 1-8-0

2 కర్మయోగము శ్రీవివేకానంద స్వాములవారిగ్రంథమునకు తెనుగు 0-12-0

3 భీష్ముని చరిత్రము ధర్మబోధకము. 0-12-0

4 చమత్కార చంద్రిక. శృంగార చమత్కార పద్యరత్నములు. 0-12-0

5 ఆనంద చంద్రిక. హాస్యశృంగార, చమత్కార, వినోద పద్యరత్నములు. 1-0-0

6 కోయిలపాటలు భావబంధురము లయిన మధురకవితలు 0-6-0

7 నిరుద్ధ భారతము 0-8-0

8 పుష్పవేణి నాటకము నవరసభరితము. 0-10-0

9 వీరమతీ నాటకము—వీరరస ప్రధానము 0-10-0

10 సరస రసాయనము (సరసపద్యములు) 0-4-0

11 బాలవితంతు విలాపము, జాలిగొలుపు పద్యములు. 0-5-0

వలయువారు:—నుంగిపూడి వేంకటశర్మగారు,
నిడదవోలు, పశ్చిమగోదావరిజిల్లా

## దేశభక్తరత్నమును భారతబాంధవుండును నగు శ్రీ మోహనదాసు కరమ్చంద్ గాంధిగారు మాయవరమున పంచముల సన్మాన పత్రమునకు ప్రత్యుత్తరముగా నిచ్చిన యుపన్యాస సారాంశము.

సహోదరులగు నీపంచముల వలన నే నీసన్మానపత్రమును స్వీకరింపఁ గలుగు మహదానందము ననుభవింపఁగలుగుట కేవలమాకస్మికము. నాపంచమ సోదరులు, "మాకు ద్రాగుటకు తియ్యని మంచినీళ్ళు దొరకుట కష్టముగ నున్నది. ఆహారపదార్థములు లభించుట యసాధ్యముగ నున్నది. మేము భూమిని కొనుటకుఁ గాని భూమిని దున్నుకొనుటకుఁ గాని వీలు లేకుండనున్నది. మేము న్యాయస్థానములకు పోవుటకుఁ గూడ నభ్యంతరము కలిగియున్న" దని ఈ స్వాగత పత్రమున వ్రాసిరి. న్యాయస్థానములకు పోఁజాల కుండుటకు భయమే కారణమని నేను తలంచెదను. వారికి న్యాయస్థానము లన్న భయములేదు (న్యాయస్థానములకేగిన) పంచమేతరులు బాధించెదరను భయమే వారి కాటంకము కలిగించుచున్నది. ఇట్టిస్థితి పంచములకు ప్రాప్తించుటకెవరు కారకులు? ఇట్టిస్థితియే కలకాలము వర్ధిల్ల వలెననునదియే మనసంకల్పమా? ఇట్టి పంచమభేదము హిందూ మతధర్మములలో నొక్కటి యగు

నా? నేను తెలియక అడుగుచున్నాను. నేనింకను హిందూ మతమనగనేమో గ్రహింపవలసి యున్నది. నేను విదేశములం లోనుండి హిందూమత స్వరూపమును గ్రహించగలిగినంత వరకు ఈ పంచమవేధ హిందూమత ధర్మములలో నొక్కటి గాదని తలంచు చుంటిని. పంచములు—అంటరానివారు (చెప్పరానివారు—పెద్దకులమువారు) అని పిలువబడి అనాదరింపబడుచున్న వీరి నిటుల బాధపెట్టుట హిందూమతధర్మములలో నొక్కటియని ధ్రువపరచుటయే ప్రాప్తించెనేని నేను హిందూమతమునకు ప్రబల విరోధినని బహిరంగముగ చాటుకొనుటకు గూడ సంసిద్ధుడనై యున్నాను. కాన నేనింతవరకు హిందూమత మిట్టి కఠినధర్మముల కాకరమైనదని నమ్ముట కవకాశము కలుగలేదు. హిందూమతమున నిట్టిప్రజావేధి ముఖ్యధర్మములలో నొక్కటియని నమ్మవలసినంతటి దుర్గతి నాకీజన్మమున తటస్థింపకుండుగాకయని దైవమును ప్రార్థించుచున్నాను. ఈపంచమశాఖకు బాధ్యులెవరు? బ్రాహ్మణులెచటనున్నను గూడ బ్రాహ్మణజన్మ మెత్తుటవలననే తమకు సర్వస్వాతంత్ర్యములకును హక్కుగలదని వారె సర్వాధికారులై సంఘమున కధిష్ఠాతలై యున్నారని నేను వింటిని. నేడు బ్రాహ్మణులట్టి సర్వాధికారమును కలిగి సంఘాధిష్ఠాతలై యున్నారా? నిజముగ వారటుల సంఘాధికారులై యున్నచో నీపంచముల నిట్టిదుర్గతికి పాలుపరచిన పాపమునకు ఫలమును వారే యనుభవించెదరు. ఇట్టి ప్రతిఫలమునే వారు మూటగట్టుకొనగలరని నేనిచట స్పష్టముగ నుడువుచున్నాను. ఈపంచములు నాయెడల చూపిన కరుణకు వారికిపుడు నేను చేయదగిన దీమాత్రపు వాక్సేవయే. బ్రాహ్మణులు తాము వెనుక నెట్టి యున్నతస్థితియందుండిరో అట్టి యున్నతస్థితిని మరలబొందుటకు ప్రయత్నింపవలసిన కాలమిదివరకే వచ్చియున్నది. భగవద్గీతలలో పండితులను పంచములను సమదృష్టి నెవ్వడు పరికించునో అతడే యథార్థముగ బ్రాహ్మణుడనిపించుకొనుట కర్హుడని శ్రీకృష్ణభగవానులు పార్థున కుపదేశించిరి. మాయావరములోని బ్రాహ్మణులు పంచములయెడల నట్టిసమదృష్టినే కలిగియున్నారా? మేమట్టిసమభావమునే కలిగియుంటిమని వారిపుడు నాతో చెప్పెదరా? మేమటుల సమభావమును కలిగియున్నను ఇతరులు మాతో కలసి రాకున్నారని వారనెదరా? వారటుల చెప్పినను గూడ హిందూమతమునుగూర్చి నేను నాయభిప్రాయమును మార్చుకొనకుండు నంతవరకును వారిమాటలను నేను విశ్వసింపజాలను. ,,జన్మగౌరవమువలనను తపశ్చర్యవలనను ఉత్తమస్థానములు మాకు లభించుచున్నవనియే నిజముగ బ్రాహ్మణులు తలంచుచున్నచో వారింకను చాల శుశ్రూషచేసి యభ్యసింపవలసినవారే యగుదురు.



మాధుర్యము ! **పుష్పవేణీనాటకము.** లాలిత్యము!

ఇందలి కథాచమత్కారము అత్యాశ్చర్యకరము. పుష్పవేణివంటి మహాపతివ్రత మరియొకతె లేదు. పుష్పవేణి వరించిన సుప్రకాశుఁడు వివాహవిముఖుఁడైనపుడు తండ్రి బిడ్డలకు జరిగిన సంవాదము చదువఁదగినది అరణ్యమునందు సుప్రకాశుఁడు సర్పదష్టుఁడై మూర్ఛిల్లియుండఁగా అతనిని పెండ్లియాడుటకై వెదకుచువచ్చిన పుష్పవేణి శోకించుచు సహగమనము చేయ సాహసించినఘట్టము అద్భుత విషాదములు కలిగించును. దొంగల వికటంపు మాటలును పాటలును కడుపుచెక్కలగునట్లు నవ్వించును

వెల 0—10—0

## వీరమతీ నాటకము.

జాములో పదునొకండుగురు వీరులనుజంపిన రాజత్రిస్త్రీ చరిత్రము. వీరరసభరితమై యుద్రేకము .గలిగించును స్త్రీసాహసము, స్వార్థత్యాగము, దేశభక్తి ఈనాటకమునందే చూడవలయును. శత్రుసంహారము చేయునపుడు వీరమతి వచించిన వీరాలాపములుగల పద్యములు గుండెలు గుబగుబలాడించును. వీరమతి పరోపకారార్థము భర్తతోడను కుమారునితోడను కాళికాదేవికి ప్రాణములు సమర్పింపఁబోవు పట్టుగల పద్యములు వల్లరాతినైన నీరుచేయక మానవు.

వెల 0—10—0

